# పీఠిక



"ఖాదీ" యనుపేరుగలిగి, చిన్నదైనను అమూల్యవిషయములుగల యీ పుస్తకమునకు పీఠిక వ్రాయునవకాశము నాకిచ్చినందునకు "ఆణాగ్రంథమాల" కార్యకర్తలకు కృతజ్ఞుడనై యున్నాను.

దీనిలోని వ్యాసములు ఖద్దరునుగురించి అధికారపూర్వకముగా చెప్పగలమహాశయులు రచించినవి. ఎవని త్యాగము, మహోన్నతవిజ్ఞానము నేటి కాలమున యావత్ప్రపంచమునకు అలంకారభూతమై యున్నదో, అట్టి గాంధీమహాత్మునియొక్కయు, విఖ్యాతభారత పుత్రరత్నము పండితజవాహర్లాలు నెహ్రూయొక్కయు ఖద్దరునుగురించిన వాక్యరత్నములు దీనియందుకలవని చెప్పినచో, దీనియోగ్యతను వేరుగా ప్రశంసించవలసినపని యుండదు. విజ్ఞానప్రదములగు నితర వ్యాసములరచయితలు అఖిలభారతచరఖాసంఘ ఆంధ్రశాఖ కార్యదర్శులగు శ్రీ నారాయణమూర్తిగారు, అఖిలభారత చరఖాసంఘకార్యదర్శులును, సుప్రసిద్ధ త్యాగశీలులునునగు శ్రీకృష్ణదాసుజాజుగారు, ఒకప్పుడు మననిజాంరాష్ట్ర ప్రధానమంత్రిగానుండిన కే. శే. సర్ అక్బర్ హైదరీగారు, మనప్రభుత్వమునకు మాల్గుజారీకార్యదర్శియగు గ్రిగ్సను ఐ.సి. యస్ గారు, తుదకు పేర్కొనబడినను తక్కువవారు కానట్టి, హైదరాబాదు ఖాదీ ప్రచారసంఘ కార్యదర్శి, శ్రీరామకృష్ణ ధూతుగారు అనువారలు.

వ్యాసములలో, శ్రీరామకృష్ణధూతుగారివి, మనరాష్ట్రములోని ఖాదీ వివరములను, అత్యుపయుక్తములును విజ్ఞానప్రదములునునగు అంకెలతో, తృప్తికలుగునట్లు బోధించునవికనుక చాలముఖ్యములును, ప్రత్యేకమగు విలువగలవియునైయున్నవి. వీనిలోని సంగతులను నిజాంరాష్ట్రపు ప్రతియాంధ్రసోదరుడును, ఆంధ్రసోదరియు చదివి బాగుగాగ్రహించదగియున్నవని నా యభిప్రాయము.

దీనిలో వెలువడిన సర్ అక్బర్ హైదరీగారి యభిప్రాయములు, వారు, ౧౬-౧౨-౧౩౩౭ ఫసలినాడు నిజాంరాష్ట్ర సహకార మహాసభకు అధ్యక్షులుగా ప్రకటించినవి. అనగా. నేటికి పదునాల్గు సంవత్సరములకిందట వారు వెల్లడించినట్టివి, అప్పుడువారు మనరాష్ట్రపు మంత్రివర్యులో నొకరైయుండిరి. తరువాత పదిసంవత్సరములకు, అనగా ౧౩౪౭ సంవత్సరమున వారు ప్రధానమంత్రిపదవి నలంకరించి, దాదాపు నాలుగేండ్లవరకు ఆమహోన్నత దశయందుండిరి. "ఖాదీ—రాట్నము" నుగురించి వారుప్రకటించియుండిన యభిప్రాయములను వారు రూపమునకు తెచ్చియేయుండినచో, మన బీదసాదల కపారమగు సహాయము, జీవనోపాధి లభించియుండెడిది. కాని, దేశదురదృష్టమువలన, వారు చెప్పదగినమేలు ఖాదీ యుత్పత్తికిగాని, దాని ప్రసారమునకుగాని చేసియుండలేదు. ఉద్యోగమును వదలుకొనుటకు సుమారు ఏడాదిముందు, చరఖాఖాదీలపనిని రాష్ట్రములోని ఎనిమిది కేంద్రములలో, పరి

క్షౌరము, ప్రారంభించుటకొరకై, సంవత్సరమునకు రెండువేల ఎనిమిదివందల ఉస్మానియా రూపాయల వ్యయము నంగీకరించునట్టి యొక స్కీము మహాఘనతవహించిన శ్రీ నిజాము ప్రభువరేణ్యుని అంగీకారమును సంపాదించి ప్రకటించి యుండిరి. కాని ఆమాత్రపు కార్యారంభమైనను ఇప్పటివరకు జరిగిన జాడ కాన్పించలేదు. ఇది విచారకరమైన విషయము!

నాల్గుజారిశాఖయొక్క కార్యదర్శియగు గ్రిగ్సను ఐ. సి యస్. గారి సూచనలు ఖాదీని గురించినవి, దీనిలో గలవు. అవి వీరు ఈరాష్ట్రమున ఉద్యోగమునందుండిన కాలమున, రెండేళ్లకింద చేసినట్టివి తరువాత కొలది కాలమునకే వీరు ఇచ్చటినుండి స్వస్థానమునకు వెళ్లియుండిరి. అదృష్టవశమున, వీరు అదే యుద్యోగముపైన తిరుగ దయచేసి యున్నారు. వీరు ఉదారస్వభావము కలవారని ప్రతీతి. పూర్వము తాముచేసిన సూచనలకు అనుగుణ్యముగా, చర్ఖా ఖాదీలపనిని మనరాష్ట్రమున విశాలముగా వ్యాపింపజేయు స్కీము నొకదానిని ప్రభుత్వమువారిచే నంగీకరింపజేసి అమలులో పెట్టించినచో, బీదసాదలకు చాల మేలు చేసినవారగుదురని నేను నమ్ముచున్నాను. దైవమువీరికట్టి సద్బుద్ధిని ప్రసాదించుగాక!

అత్యంతోపయోగకరమగునని పుస్తకమును అందరును చదివి లాభము పొందెదరని యాశించుచు విరమించుచున్నాను.

"ఆంధ్రపతీరము", సుల్తానుబజారు
హైదరాబాదు-దక్కన్. ౧౩౪-౪-౪౨ } మాడపాటి హనుమంతరావు.

అరణ్యసీమలయందలి ఋష్యాశ్రమములే భారతీయ సభ్యతకు కేంద్రస్థానములు. జనపదములే భారతజాతీయ జీవనమున కునికిపట్లు. మన జీవనరక్తప్రసారమునకు గ్రామములు ధమనులు, పట్టణములు సిరలు, జనపదమే హృదయస్థానము. మన మహర్షులు అరణ్యసీమలనుండి ప్రసాదించిన జ్ఞానమే నేటికిని అజ్ఞాన తిమిర భాస్కరమై వెలుగుచున్నది. "కౌపీనవన్తః ఖలుభాగ్యవన్తః" అని శ్రీ శంకరులవారు సెలవిచ్చినట్లుగ, నున్నత భావోపేతమైన నిరాడంబర జీవనమునకుగల గౌరవము భరతవర్షమునందు గాక మఱెచ్చట గలదు? త్యాగవర్ణమగు కాషాయము సాధువులకును, చరఖాలాంఛన లాంఛితమైన మన జాతీయపతాకమునందును గాక మఱెచ్చట గ్రాహ్యమైనది? ఖాదీ యిట్టి విశుద్ధ సాత్త్విక జీవనమునకు ప్రతీకముగానున్నది.

### పాశ్చాత్య సభ్యతానుకరణమువలన యనర్థములు

ఇటీవల పాశ్చాత్య సభ్యతానుకరణమువలన, మన జాతీయ జీవనమంతయు కలుషితమై, పట్టణములలోను నగరములలోను కేంద్రీకృతమగుచున్నది. గ్రామ సౌభాగ్యము పోయినది. జనపదంబులు శిథిలములైనవి. ప్రాఙ్ముఖముగా బ్రవహించుచుండిన మన జీవన స్రవంతి నేడు పశ్చిమాభిముఖముగా బ్రవహించుచున్నది. సహజముగ ధనము పట్టణములనుండి గ్రామములకు పోవలసియుండగా, నేమి పాపమో గాని గ్రామస్థుల ధనమంతయు పట్టణములకును, తద్ద్వారా

విదేశములకును ప్రవహించుచున్నది. ఖద్దరు మున్నగు గ్రామ పరిశ్రమ లే యీ ప్రవాహము నరికట్టవలెను

కృషి-నేత, గ్రామసంపదకు పాదద్వయము

"కృషి — నేత — గ్రామసంపదకీ రెండును రెండు పాదములు. దీనికి వడుకుటయే మూలాధారము భారతదేశము నకు వ్యవసాయము, నేత ముఖ్య జాతీయపరిశ్రమలని చెప్ప గా కొందఱు పరిహసింతురు. వ్యవసాయము తరువాత, వడుకు, నేతపనులే ముఖ్య జాతీయ పరిశ్రమలు" అని శ్రీరమేశ చంద్రదత్తుగారు తన "హిందూదేశ చరిత్ర" (విక్టోరియాయుగము)లో స్పష్టముగ వ్రాసిరి. వెనుక శ్రీగాంధిమహాత్ముని న్యాయాధికారి నీవృత్తి యేమని ప్రశ్నించినపుడు, "నేను వ్యవసాయకుడను, నేతగాడను" అని వెంటనే ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్లు చెప్పుటలో మహాత్ముని భావమేమి ? ఆయన భారతజాతీయ జీవనమున కేకైకప్రతినిధిగా నిలబడి, యిట్లు చెప్పెను భారతజాతీయ జీవనమంతయు మహాత్ముని యందు మూర్తీభవించెను. కావుననే ఆయన ఖాదీయొక్క అపరస్వరూపమై (alter ego) విరాజిల్లుచున్నాడు.

ఖద్దరు సూర్యగ్రహమువంటిది

ఖద్దరు 'గ్రామపరిశ్రమ గ్రహమండలి'లో సూర్య ..వంటిది. ఉపగ్రహములు సూర్యగ్రహము నాశ్ర ...న్నట్లే యితర గ్రామపరిశ్రమలన్నియు ఖద్దరు ...పరించియున్నవి. కొంతకాలముక్రిందట ఖాదీ

# ఖాదీ మహిమ

అఖిల భారత చరకాసంఘ, ఆంధ్రశాఖా కార్యదర్శులగు
శ్రీ నారాయణమూర్తిగారు

---

భారతీయ సంస్కృతి

ఆత్మవికాసందర్శనము సంస్కృతి యనబడును. సంస్కృతి బాహ్యావేషమునందు లేదు. తళుకు, బెళుకులయందు లేదు. అది హార్ధికవికాసమునందును, తజ్జన్యకృతి విశేషమునందును గోచరమగును. నడవడివలనను, శీలమువలనను సంస్కృతి ముఖ్యముగా ద్యోతకమగును. వ్యక్తులకువలె జాతులకుగూడ సంస్కృతిని బట్టి విశిష్టలక్షణము లేర్పడును. భారతీయుల ఆధ్యాత్మికత, గ్రీకుల సౌందర్యోపాసన, రోమనుల శాసన పటిమ లోకప్రసిద్ధి గాంచినవి ఈ మూడుజాతుల సంస్కృతులను క్రమముగా ధర్మము, సౌందర్యము, శాసనము అను పదములచే సంగ్రహముగ వర్ణించవచ్చును ఏ సంస్కృతి మానవకల్యాణ సంధాయకమో, ఏ సంస్కృతి అఖిలమానవ కోటిని ధర్మపథమున నడపుచు, నాధ్యాత్మిక వికాసమునకు దోడ్పడునో అదియే నిజమైన సంస్కృతి.

ముఖ్య లక్షణములు

అర్థకామములను ధర్మబద్ధ మొనర్చుటయే భారతీయ సంస్కృతియొక్క ముఖ్యలక్షణము. ధర్మమిటు అర్థకామము లకును అటు మోక్షమునకును దేహళీదీపన్యాయముగ మధ్య

నున్నది. ఇట్టి దృష్టితోనే భారత జాతీయతా సంఘటనము గావింపబడినది.

జడ ద్రవ్య తృష్ణ లేకుండ జగద్ధిత కార్యము లొనర్చు చుండుటయు, దేశసంపత్తిని ప్రజలందఱు సక్రమముగా ననుభ వించునట్లు సమాజరచన గావించుటయు, భోగలాలస ప్రవృత్తిని తగ్గించుకొని, ఉన్నతాదర్శప్రాప్తికై నిరాడంబర జీవనము గడపుటయు, పరస్పర వ్యవహారములను సహకార పద్ధతిని నిర్వహించుకొనుటయు భారతీయ సంస్కృతియొక్క ముఖ్యలక్షణములు

ఖాదీ భారతీయ సంస్కృతికి చిహ్నము

వస్త్ర సంబంధములో ఖాదీ భారతీయ సంస్కృతికి చిహ్నముగా నున్నది. ఖాదీ గృహపరిశ్రమల కన్నిటికి ప్రతి నిధిగా నుండి పతనోన్ముఖమైన మానవజాతిని నుద్ధరింప నున్నది. మానవునియందలి అసురసంపత్తిని నశింపజేసి దైవిక సంపత్తిని పెంపొందింపజేయగల మహిమ ఖాదీయందుగలదు. ఖద్దరువలన ప్రజలలో సహకార భావము వృద్ధియగును. ఖాదీమూలమున ప్రజలలో ద్రవ్యము గుప్తదానరూపమున క్రమముగా పంపిణీ అగుటవలన, సమ జములో నిమ్నోన్నత భావ మంతరించి సమభావ మేర్పడును.

ఋష్యాశ్రమములు భారతీయ సభ్యతకు కేంద్రస్థానములు

భారతదేశపు సంస్కృతియు సభ్యతయు రాజప్రాసా దములలోను మహానగరములలోను జన్మించియుండలేదు.

మన దేశములో పట్టణములును నగరములును తక్కువ, గ్రామములు మెండు. నగరవాసులుగూడ గ్రామజీవనమున కలవడవలెను. గ్రామపరిశ్రమలను పునరుద్ధరించవలెను. గ్రామ పునరుద్ధరణోద్యమము జానపదుల కెంత అవసరమో నగర వాసులకుగూడ అంతఅవసరము ప్రస్తుతము మన గ్రామములు నగరముల కనుబంధముగానున్నవి. నగరములు, గ్రామముల కనుబంధములుగా నుండవలెను. గ్రామములను పునరుద్ధరించవలెను, గ్రామ సౌభాగ్యమును వృద్ధిచేయువలెను. ఖద్దరుద్యమమేగాకుండ, ఖద్దరుమున్నగు గ్రామ పరిశ్రమలద్వారా విద్యగఱపువిధానము (వర్ధా విద్యావిధానము) వలన గూడ గ్రామపునరుద్ధరణ విషయములో మహత్తర ఫలితములు చేకూరగలవు.

### 'స్వదేశీ'కి మూలసూత్రము

స్వదేశీవ్రతము త్యాగమునకు ప్రారంభము. ఈ స్వదేశీ భావమునకు మూలసూత్రమేది? శ్రీగాంధిమహాత్ముడు తాను రచించిన హైందవ స్వరాజ్యమను గ్రంధములో స్వదేశీయనస్వధర్మమని సూచించెను. స్వధర్మ స్వరూపము భగవద్గీతలలో నిట్లు వర్ణింపబడినది —

శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః॥

భగవద్గీత—౩—౩౫

పరధర్మము లెస్సగా ననుష్ఠించుటకంటె స్వధర్మము శ్రేయస్కరము. స్వధర్మ నిర్వహణమునందు మరణించుట మేలు. పరధర్మము భయావహము.

స్వధర్మమే స్వదేశీ

ఇచ్చట యేది ఆధ్యాత్మికముగా స్వధర్మమని వర్ణింప బడినదో అదే ఆధిభౌతికముగా స్వదేశీయనబడుచున్నది. స్వదేశీ యీయుగములో ననుష్ఠింపదగిన యుత్తమధర్మము లలో నొకటి స్వదేశీధర్మము మానవస్వభావములో సహజ ముగ నున్నది. ఇట్టి ఆధ్యాత్మికధర్మములు ప్రకృతి ధర్మముల వలెనే స్వతస్సిద్ధములు కాని యీ స్వదేశీధర్మము మన బుద్ధి జాడ్యమువలనను, ప్రమాదవశమునను ఇటీవల విస్మరింపబడి నది. స్వదేశీ ఆర్థిక స్వాతంత్ర్య సాధనమే గాకుండ, ఆధ్యా త్మికముగ మోక్షసాధనముగూడ నైయున్నది.

స్వదేశీవ్రతునకు త్యాగ మవసరము

స్వదేశీవ్రతునకు త్యాగమవసరము. అతడు తన ఆత్మోపలబ్ధికి అనవసరమైన వస్తువుల నన్నిటిని విడువవలసి యుండును. ఒకప్పుడు తనకుటుంబమును తన దేహమునుగూడ త్యాగము చేయవలసివచ్చును. ఈ సిద్ధాంతమునుబట్టియే స్వదేశీ దీక్షాపరుడు తన పరిసరములలో నుత్పన్నమయిన వస్త్రములు మొదలయిన వస్తువులనేవాడుచు, దూరదూర ప్రదేశములలో తయారగు వస్తువులను విసర్జించవలసియుం డును. ఈసూత్రము ననుసరించియే గాంధిమహాత్ముడు 'స్వదేశి' పదమునకీక్రింది నిర్వచనమొసంగెను —

మహాత్ముని 'స్వదేశి'పద నిర్వచనము

"Swadesi is that spirit in us which restricts us to the use and service of our immediate surroundings to the exclusion of the more remote."

మిహిర(సూర్య)నకు వెలుగుతగ్గినది. దానితో నుపగ్రహముల దీప్తి గూడ క్షీణించినది. శ్రీ గాంధిమహాత్ముడు ఖద్దరుద్యమము ప్రారంభించినప్పటినుండియు ఖాదిభానునకు మరల కాంతి హెచ్చ నారంభించినది. ఇట్లు కాంతి హెచ్చినకొలదియు ఉపగ్రహముల కాంతి వృద్ధినొంద నారంభించినది.

మన భారతదేశములోని ౭ లక్షల గ్రామములు సజీవముగా నుండవలయుననిన, నాగరికత మూలమగు శాంతి చేకూరవలయుననిన, ఖద్దరు పరిశ్రమ గ్రామ పరిశ్రమల కన్నిటికి కేంద్రముగా నుండవలెను. తారాపథమును దూరదర్శినితో పరిశీలించినకొలదియు నూతననక్షత్రములు గోచరమగునట్లే, ఖద్దరు నాధారము చేసికొని పరిశోధనచేసిన, స్థూలారుంధతీ న్యాయముగ నూతన గ్రామపరిశ్రమలు గోచరమగును.

వడుకుపని పవిత్రమైనది అందరికి హితమైనది, సుకరమైనది.

"వడుకుపని చాలపవిత్రమైనది అందరికి హితమైనది. సుకరమైనది." ప్రతియింటిలో రాట్నము పెట్టినగాని భారతదేశమునకు ఆర్థికమోక్షము లేదు. మనకు కావలసిన ప్రత్తి అంతయు మన దేశములోనే పండును. వడుకు నూలుతోనే మనకు కావలసిన వస్త్రములు మనము తయారుచేసికొనగలము. వ్యవసాయమునకు ముఖ్యమైన ఉపవృత్తి ఒకటి భారతదేశమునకు గావలసియున్నది. వడుకుపని మాత్రమే లక్షల కొలది ప్రజలకు ఉపవృత్తి గానుండగలదు. ఒక శతాబ్దము

క్రిందట వడుకుపని మాత్రమే లక్షలకొలది ప్రజలకు ఉప వృత్తిగా నుండెను. ఒక శతాబ్దము క్రిందట వడుకుపని మన భారతదేశములో జాతీయపరిశ్రమగా నుండెను."

### వడుకుపని సార్వజనికము గావలసియున్నది

సుందరమైన యీ వడుకుపని దేశమంతట సార్వజనికముగ నభ్యసింపవలసియున్నది. భరతవర్షములో ప్రతిఇల్లును స్వయంపోషకముగ నుండకతప్పదు. ఏదైననొక ఉపవృత్తి యున్నగాని స్వయంపోషకముగ నుండుటకువీలులేదు వడుకుపని సర్వత్రవ్యాపించిన, వస్త్రములకై వెచ్చించు కోట్లకొలది ద్రవ్యము మన దేశీయులకే ముట్టును. వడుకుపని సర్వత్ర వ్యాపించుసరికి, నేతవారికి, ఏకువారికి చేతినిండ పనిగలుగును. ఇదియే వడుకు పరిశ్రమవలన చేకూరు ఆర్థిక ప్రయోజనము.

### ఖాదీ అర్థశాస్త్రమునకును ఇతర అర్థశాస్త్రమునకును గల భేదము

ఖాదీ అర్థశాస్త్రమునకును, మామూలు అర్థశాస్త్రమునకును భేదముగలదు ఖాదీ అర్థశాస్త్రము దేశాభిమానమునమీదను ప్రేమభావముమీదను ఆధారపడియున్నది. ఇందు స్పర్ధకు తావులేదు. మామూలు అర్థశాస్త్రము స్పర్ధకును, అహమహమికకును పుట్టినిల్లు.

### గ్రామాభ్యుదయమువలన దేశాభ్యుదయము

ఖద్దరు నాదరించుటవలన గ్రామాభ్యుదయమును, గ్రామాభ్యుదయమువలన దేశాభ్యుదయమును చేకూరును

స్వదేశీ దీక్షాపరుడు ప్రప్రథమమున దవు దవ్వుల నుత్పన్నమగు వస్తువులను విసర్జించవలెనని చెప్పుటలో వాని యందు ద్వేషభావముతో గాదు. ఎవరి యిల్లు వారు చక్క-బెట్టుకొనిన చివరకు మొత్తముమీద అన్ని యిళ్లు చక్క-బడును. ఇంటగెల్చి రచ్చగెలువవలెను. "యథాపిండాండే తథా బ్రహ్మాండే" అనే మూలసూత్రముమీద నిది ఆధారపడి యున్నది. స్వదేశీ విషయములో మన మీ సూత్రమును విస్మరింపరాదు. కావున 'పరధర్మము లెస్సగాననుష్ఠించుట' కంటే విగుణమైనను స్వధర్మము శ్రేయస్కరము అను గీతా వాక్యమును భౌతికముగా నన్వయము చేసికొనిన 'స్వదేశీ' ధర్మముగా పరిణమించుచున్నది. స్వధర్మమునుమన పరిసరములకు వర్తింపజేయు సరికి 'స్వదేశీ' యగుచున్నది. దీని బట్టియే గాంధిమహాత్ముడు తన "హైందవ స్వరాజ్యము" అను గ్రంథములో "స్వదేశియే స్వధర్మము, స్వధర్మమే స్వరాజ్యము" అను వాక్యములో స్వధర్మమునకు, స్వదేశికి, స్వరాజ్యమునకు అవినాభావ సంబంధమును దెల్పినాడు.

### ఖద్దరే శుద్ధ స్వదేశీ

స్వదేశీ ధర్మము సంఘమున కెట్లు వర్తించునాయని యోజించుటలో ఖద్దరే శుద్ధ స్వదేశీయని మహాత్మునకు దోచెను. ఖద్దరు సంపూర్ణముగ భారతీయ వస్తువులతోనే భారతీయులచేతనే భారతదేశములోనే తయారగుచున్నది. కావున ఖాదీ శుద్ధ స్వదేశీవస్తువు. శ్రీ గాంధిమహాత్ముడు భారతీయ పరిశ్రమ నిట్లు నిర్వచించియున్నాడు -

"As part of our coustructive programme Gandhiji has been insisting on self-sufficiency in villages, especially in the matter of food, clothing and other primary needs."

"We suggest every nation should confine its wants of necessities to such as it can produce itself obtaining only luxury goods from outside. This means we have to make every country self-sufficient in the matter of food, clothing and shelter Here again we arrive at the programme scheduled by Gandhiji"

### వ్యక్తిగత స్వావలంబనము, జాతీయ స్వావలంబనము

దీనినిబట్టి మనము వ్యక్తిగతముగను జాతీయముగను స్వావలంబులమై యుండవలెనని విదితమగుచున్నది. ఇందుకు గాను మనము ఖాదీ మొదలయిన గృహపరిశ్రమలను (గ్రామోద్యోగములను) పునరుద్ధరించుకొనవలెను. ఈపరిశ్రమలకు రక్షణము (Protection) అవసరము.

### నిజాంరాష్ట్రములో వస్త్ర స్వావలంబనము

నిజాంరాష్ట్రములో ౧,౬౧,౯౪,౩౧౩ జనాభాగలదు. సగటున ఒక్కొక్కనికి ౨౦ గజములచొప్పున ౩౨,౩౮,౮౬,౨౬౦ గజముల ఖద్దరు కావలెను. ఇంత ఖద్దరు తయారగుటకు షుమారు ౧౧,౮౩,౧౫౦ రాట్నములు పనిచేయవలెను. ఈరాట్నములు దాదాపు ౨,౪౩,౦౦౦ చేమగ్గములకు పనియివ్వగలవు. ఒక్కొక్క వడుకు మనిషికి సగటున సాలీనా ౧౦౦ రూపాయిలవంతున, వడుకువారికి రమారమి రు ౧౧,౮౩,౧౫,౦౦౦ లును, ఒక్కొక్క నేతవానికి సగటున సాలీనా ౧౫౦ రూపాయిల వంతున,

నేతవారికి రు ౩,౬౪,౫౦,౦౦౦ లను కూలిరూపమున ముట్టగలవు. ఈవిధముగా రాష్ట్రములోని ద్రవ్యము రాష్ట్రనివాసులగు వడుకువారికి నేతవారికి మాత్రమేగాక, ఖద్దరుత్పత్తికి సంబంధించిన యితర కార్మికులకుగూడ ముట్టగలదు. ఖద్దరుతో పాటు ఇతర గృహపరిశ్రమలను గ్రామపరిశ్రమలను పునరుజ్జీవింప జేసిన, రాష్ట్రసంపదయంతయు రాష్ట్రవాసులకే చెందగలదు. ఈవిధముగా రాష్ట్రమునకును రాష్ట్రవాసులకును ఖద్దరుద్యమ మూలమున వస్త్రస్వావలంబనమేగాక, తద్వారా ఆర్థిక స్వావలంబనముగూడ చేకూరగలదు. ఈయాదర్శసిద్ధికై నిరంతరకృషి జరుగవలసియున్నది. ఈకృషి సఫలమగుచో, దేశసౌభాగ్యము సర్వతోముఖ వికాసము గాంచగలదు. దేశము సకలసంపదలతో తులదూగుచు సుభిక్షముగా నుండగలదు.

---

# గాంధి మహాత్ముని సందేశము

## అ ప్ర మా ణి త ఖా ది

అప్రమాణితఖాది (అనగా ధృవపత్రముపొందనిఖాది) ని కొనువారికి ఖాదియొక్క లక్షణములు తెలియవు. ఖాది బీదప్రజల దారిద్ర్యమును దూరముచేయుటకు ఉద్దేశింపబడి నది. ఏది దారిద్ర్యమును రూపుమాపునో అదియే సాధనము కాగలదు. ఈదృష్టితో ఖాదియొక్క ప్రాముఖ్యత మరింత హెచ్చును. కోట్లకొలది ప్రజలను దారిద్ర్యదుఃఖసాగరమునుండి ఖాదిద్వారా గట్టెక్కించవలెనన్న అది ఏదేని ఒకసంస్థలేక ప్రభుత్వముయొక్క యాజమాన్యముక్రింద నుండవలెను. ఇది ఎందులకందురా దారమువడుకు కోట్లకొలది స్త్రీలు ఆకలి మంటను చల్లార్చుటకై, ఒక్కపైసకొరకు ౮ గంటలైనను వడు కుటకు సిద్ధపడెదరు. ఇట్టిదారముతో నేసిన బట్టనుగూడా చేతితోనేయబడిన ఖాదిఅని యనవచ్చును. కానిఇట్టి (అప్ర మాణిత)ఖాదిని ఉపయోగించి మనము బీదలసేవచేయలేము. కనుకనే చరఖాసంఘము దారమువడుకువారికూలి ఎక్కువ చేసినది. ఇతరపనివారల ఆర్థికపరిస్థితులను చక్కబరచుటకును ప్రయత్నములు సాగుచున్నవి.

అప్రమాణితఖాదిని విక్రయించువారు ఖాదిపనివార లను దొంగిలించుచున్నారు. కనుక ఇట్టిఖాదినికొనుట దొంగ సొమ్మునుకొనుటయగును. అదిఅధర్మము. అప్రమాణితఖాది విక్రయముమాని మరేదైనవ్యాపారము చేయవలసినదని అట్టి

వర్తకులను చరఖాసంఘము ప్రార్థించుచున్నది. ఇకపత్రికలను ప్రార్థించునదేమనగా వారు చరఖాసంఘ దుకాణమునుండి గాని, లేక చరఖాసంఘ ఆజ్ఞాపత్రమునుపొందిన వారినుండి గాని ఖాదినికొనవలెను.

ఖాది ఉపయోగించువారు ఈ చిన్న విషయమును మన్నింతురని నేనాశించుచున్నాను. ఇంతేల అధిచౌక యైనను ప్రియమైనను చరఖాసంఘముద్వారా దొరుకునట్టిదే ఖాదియని తలచబడవలెను. (ఖాదిజగత్తు)నుండి

సేవాగ్రామ్. ౧౮ సెప్టెం. ౧౯౪౧.

## పండిత జవహర్‌లాల్ నెహ్రూగారి సదభిప్రాయము

దక్షిణ హైదరాబాదులో మహారాష్ట్ర చరఖా సంఘమువారి ప్రథమ ఖాది దుకాణముయొక్క ప్రారంభోత్సవము సల్పుచు నెహ్రూ పండితుడు ఈక్రిందివిధముగా అభిప్రాయపడియున్నారు.

"నేడు నేనీ ఖాదిదుకాణమును ప్రారంభించుచున్నాను. ఇచట ఖాది కార్యక్రమము సాగుచున్నదని తెలిసినందుకు సంతసించుచున్నాను. ఈ కార్యక్రమమునకు విజయము చేకూరగలదని నేనాశించుచున్నాను. దీని ద్వారా జన సామాన్యముయొక్క స్థితిగతులు చక్కబడగలవు. మరియు విదేశవస్తు బహిష్కరణము తగు సహాయము లభించగలదు."

౮ జూను ౧౯౪౧. జవహార్‌లాల్ నెహ్రూ.

# రాట్నము—స్వరాజ్యము—అహింస

మహాత్మా గాంధి

నాదృష్టిలో రాట్నము జనసామాన్యముయొక్క ఆశలకు ప్రాతినిధ్యము వహించుచున్నది. ఆమాత్రము మిగిలియున్న స్వాతంత్ర్యము రాట్నముతోబాటు అంతరించినది. పల్లెటూరిప్రజకు రాట్నము సహాయకారిగానుండెను. దీనికతన వ్యవసాయదారుల ప్రాముఖ్యత హెచ్చెను. ఇది వితంతువులకు జీవనాధారమై, గ్రామవాసుల సోమరితనమునకు చికిత్సయై వెలయుచుండెను. ప్రత్తిలోనుండి గింజలను వేరుపరచుట మొదలు ఏకుట, వడకుట, నేయుటమరియు అద్దుట రంగువేయుటవరకు అన్నిపనులు ఖాదిపరిశ్రమలో చేరియుండెను. గ్రామములందలి వడ్లకమ్మర్లకును ఇందువలన పనిదొరుకుచుండెడిది. రాట్నమూలమున హిందూదేశములోని లక్షలకొలదిగ్రామములు స్వయంపోషకములై యుండెను. అటురాట్నము మూలబడిన ఇటునూనెగానుగలుగూడ అంతరించినవి. ఏపరిశ్రమలును వీటిస్థానము నలంకరించలేదు. అందుకని గ్రామవాసులు తమకుజెందిన వివిధపరిశ్రమలను మరచిపోయి, కష్టపడి కొద్దియోగొప్పయోసంపాదించుకొను అవకాశమునుగోల్పోయిరి.

గృహపరిశ్రమలు అంతరించిన ఇతరదేశముల అనుకరణతో మనకు ప్రయోజనములేదు. కారణమేమనగా అక్కడ గ్రామవాసుల జీవనోపాధికై ఇతరసౌకర్యములు కల్పించబడినవి. కాని హిందూదేశవాసులకట్టి వేవియును లేవు. పాశ్చాత్య

దేశములు పారిశ్రామికాభివృద్ధితో బాటు ఇతరదేశములపై రాజ్యాధికారమును కలిగియున్నవి. ఇక హిందూదేశము అస్వతంత్రదేశముగనుక, ఇక్కడి గ్రామవాసులను స్వయం పోషకులుగా జేయుటకు రాట్నము మరియు తత్సంబంధపని ముట్లను పునరుద్ధరించుట ప్రకృతిసిద్ధమైనది.

యువకులు త్యాగముచేసి గ్రామగ్రామముతిరిగి,రాట్న సందేశమును గ్రామవాసులకు అందజేసి, వారిలో ఆశాజ్యోతిని వెలిగించినప్పుడే ఈ పునరుద్ధరణ కాగలదు. నిజమైన సహకారమునకును మరియు వయోజన విద్యావ్యాప్తికిని ఇది ఉత్తమసాధనము. రాట్నమువలన శాంతియుతమైన, స్థిరమైన మరియు నవజీవనప్రదమైన విప్లవము రాగలదు.

నేను రాట్నమునుగూర్చి చేసినవాదము నిజమైనదని నా (౨౦) సంవత్సరముల అనుభవమునుబట్టి నమ్మిక చెప్పగలను. దారిద్ర్యమునమభవించు హిందూ, మహమ్మదీయులకు రాట్నము సమానముగా సేవచేసినది. దీనిద్వారా నేటివరకు ౫ కోట్ల రూపాయిలు ఏమాత్రము ఆట్టహాసముగాని ఆడంబరముగాని లేకయే బీదలచేతులలో బడినవి రాట్నము మనను స్వాతంత్ర్యమునకు సమీపముగా చేర్చగలదని నేను నిస్సంకోచముగా చెప్పగలను. ఇదిసకలమత సమ్మతమైనది. ఎందుకనగా రాట్నము గ్రామవాసులను తగుస్థానమునకు దెచ్చి వారినుండి పెద్దచిన్నయను భేదభావమును తొలగించకలదు.

కాని ఒక్క రాట్నముద్వారా స్వరాజ్యము దొరకనేరదు. ఎందుకనగా, అహింసపై దృఢనమ్మకము కుదురనంతవరకు రాట్నము అభివృద్ధిజెందనేరదు. తగినంతజాగ్రతయు కలుగజాలదు. స్వాతంత్ర్యముకొరకు పెనగులాడు దేశభక్తులు రాట్నమును చిన్నదృష్టితో చూచెదరు. మరికొందరు స్వాతంత్ర్యాకాంక్షులు విదేశప్రభుత్వమును అంతమందించుటకు యుద్ధము చేయ నిశ్చయించియున్నారు. ఇట్టివ్యక్తులు తప్పులన్నియు వారిలోనేయున్నవని వేలుబెట్టి చూపించెదరు. అంతేగాదు తమలో ఎట్టిలోపములును లేవని తలంచెదరు. రక్తపాతముతో స్వాతంత్ర్యమును సంపాదించిన దేశములను వీరు ఉదాహరణముగా చూపెదరు. ఇట్లు అహింసలేనిది రాట్నము రాణింపదు. అది నిరర్థకముగూడా.

స్వాతంత్ర్య సంపాదనకొరకు అహింసావిధానమునే అవలంబించవలెనని ౧౯౧౯లో అంగీకరింపబడినది. అహింసావిధానమునకు సహకారసూచకముగా ౧౯౨౧లో జాతీయ పతాకమునందు రాట్నమునకు గౌరవప్రదమగు స్థానమొసంగబడినది. కాని అహింస భారతీయుల హృదయమును చూరగొనకుండుటచేత రాట్నమునకు తగుప్రాముఖ్యత లభించజాలకపోయెను. కాంగ్రెసులోని అధికసంఖ్యాకులు అహింససిద్ధాంతమును ఆచరణలోపెట్టుదురేని అహింసకు ఏకైకసహాయకారి రాట్నమని స్పష్టపడగలదు. ఇట్లు రాట్నము ప్రజామోదమును బడయునంతవరకు అహింసయొక్క నిజస్వరూపముబయటపడదు.

# రాట్నము × గిర్ని

మహాత్మా గాంధి

వార్తపత్రికలలో నేను ఖాదినిగూర్చి వ్రాయుచున్నాను. కాంగ్రెసువారు చీకాకుపడకూడదు. అన్ని వర్గములవారును హృదయపూర్వకముగా కలిసిమెలసి యుండవలెను. తిరిగి ఇంటింటరాట్నము తిరుగవలెను. ఇదియే నారాజకీయము.

దేశమునకు ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యము ఈ మార్గముద్వారనే లభించునుగాని పరస్పర వైరుధ్యమువలన గాదని నానమ్మకము.

స్వదేశ, విదేశగిర్ని బట్టలబారినుండి ఎట్లు తప్పించుకొనవలెనను సమస్యను ప్రతికాంగ్రెసువాది ఎదుర్కొనుచున్నాడు. ఖాదివలె స్వదేశీమిల్లు బట్టగూడా మంచిదేయనియు, చౌకగా యుండుటవలన ఖాదికన్న మంచిదనియు కొందరభిప్రాయపడెదరు. కాని కోట్లకొలది బీదలను దలచుకున్నచో గిర్నిబట్టచౌక ఎట్లగునో బయటబడగలదు. కోట్లసంఖ్యలోనున్న బీదలకు గిర్నినూలుతో గిర్నిలోనేయబడుబట్ట చేతితోవడికినేయబడు బట్టకన్న ఎక్కువధరకుగిట్టును. గిర్నిబట్ట వీరి నోటిబుక్కను ఎత్తగొట్టునట్టిది.

గ్రామములందలి నేయువారిని, మరియు వడుకువారిని పూర్వపు (ఉన్నత)స్థితికి తేవలెనన్నచో అదియును తొందరగా తేవలెనన్నచో ప్రతికాంగ్రెసువాది వడుకుట, నేయుట బాగుగా నేర్చుకొనవలయును. అంతేగాదు ఖాదిపరిశ్రమకు

సంబంధించిన విజ్ఞానమంతయును 'నేర్చుకొనుట' అతనివిధియై యుండును. బీదలైన గ్రామవాసులకు వడుకుట, నేయుట నేర్పుచు వారికి దారిచూపుచుండవలెను. (ప్రతిరోజు వడకెదనని) ప్రమాణముచేసి వడుకునట్టిదారము తగినంత సేకరించవలెను. లేదా దారమువడుకుబీదలకు ఒక్క అణాకూలిఇచ్చి (౮) గంటలపని తీసికొనవలెను అనగా వెట్టిచేయించవలెను. అప్పుడే మధ్యతరగతివారికి ఖాది చౌకగా లభించగలదని నేనిదివరకే తెలిపియున్నాను. రాట్నములకును, మగ్గములకును దేశపు గిర్నీలస్థానము నియ్యవచ్చును. అట్లు 'ఇయ్యవలెను' అను నమ్మకము ప్రతికాంగ్రెసువారికి కలుగనంతవరకు పనివారు ఈ విషయమున అవసర పరిశ్రమజేసి నైపుణ్యము సంపాదించరు.

కాంగ్రెసువారికి ఇందు నమ్మకమున్నచో కాంగ్రెసు సంస్థలన్నియును వడకుట, నేయుటయొక్క ఉత్తమ శిక్షణాలయములు కాగలవు. ౧౯౨౧ లో ఏవిధముగనైన నేయింపవచ్చునని అలక్ష్యముగా కాంగ్రెసు కార్యాలయములందు నూలు ఎట్లు పోగుచేయబడినదో నాకు జ్ఞాపకమున్నది. అప్పుడు సమయము, కష్టము మరియు ధనమువృథాచేయుట తప్ప ఏమియుకాలేదు. ఈనూలును ఏమిచేయవలెనో, ఎట్లునేయవలెనో ఎవరికిని తెలియకుండెడిది. కాని ఇప్పటి పరిస్థితులు వేరు. చరఖాసంఘము అనుభవము గడించినది. విజ్ఞానము సంపాదించినది. పుస్తకములుగూడా ప్రకటింపబడినవి. కనుక ఇప్పుడు కాంగ్రెసు కార్యాలయములన్నియు

గ్రామోద్ధరణ కొరకు పడకు మరియు నేల కేంద్రములై పోవలెను. ఖాది సూర్యునివంటిది. ఇతర గృహపరిశ్రమలు సూర్యునిచుట్టునుండు గ్రహములవంటివని నేను తెలిపియు న్నాను. ఈనాపదములను శ్రద్ధతో చదివినచో, ఖాది సేవ వలన ఎట్టి దూరదర్శ ఫలము కలుగునో కాంగ్రెసువారికి తెలి యగలదు. తొందరగా గ్రామోద్ధరణ జరుగుటలో గల అటం కము ధృఢనమ్మకము లేకపోవుటయే.

హిందూదేశము అహింసాపద్ధతిపై అభివృద్ధి జెంద దలచినచో తన అధికారములను పంచిపెట్టవలసియుండును. తగు సంఖ్యలో సైన్యములేనిది, శక్తి ఒకచోట కేంద్రీకరింప బడజాలదు. సురక్షితముగను యుండజాలదు. సామాన్యపు టిండ్లలో దొంగలుపడుటకు అందులో బండాలమేమైన యుండవలెనుగదా! అదిలేనిది రక్షకభటులెందుకు? కాని ధనవంతుల భవనములను కాపాడుటకు మాత్రము రక్షక భటులవసరము. ఇట్లు హిందూదేశపు వ్యవస్థ గ్రామదృష్టి తో చేసినయెడల విదేశదాడి అంత సంభవముగాదు. కాని సముద్ర, వాయు సైన్యములతో ఎంతకట్టుదిట్టమై యున్నను హిందూదేశపు వ్యవస్థ నగరదృష్టితో చేసినచో విదేశ దాడి ఎక్కువ సంభవము.

కాంగ్రెసువారు, రాట్నమనగా నేమిటో? దాని వలనకలుగు లాభములేవియో తెలిసికొనినచో వెంటనే ఖాది సేవకు గడంగెదరని ఊహించవచ్చును. వారికి పని

రాదని ఒప్పుకొన్నను కొంత పత్తినిమాత్రము బాగుచేయగలరుగదా! తమ గ్రామములో—తాలూకాలో లేక తమ జిల్లాలో పండిన పత్తిని వాడుటమంచిది. పత్తిని చేతితో లేక కట్టెపుల్లలతో బాగుచేయవచ్చును. పత్తిగింజలు భద్రపరచవలెను. అవి ఎక్కువ సంఖ్యలో ప్రోగైన వెంటనే అమ్మివేయవచ్చును. లేదా పశువులకు పెట్టవచ్చును. చిన్నని ఉండేలతో ఏకవచ్చును. ఈఉండేల కొన్ని దమ్మిడీలలో తయారు కావచ్చును. లేదా స్వయముగా చేసికొనవచ్చును. ఇట్లు దానితో ఏకిన దూదితో ఏకులు చేసికొని కదురు(తక్లి) పైదారము తీయవచ్చును. ఈ ప్రాథమిక పనులు పూర్తియగుచో ముందు కార్యక్రమము తీవ్రముగా సాగిపోగలదు.

ఖాదీ వాడుకొనుటవలన వారు తమయొక్కయు తమ సంబంధీకుల యొక్కయు నడవడిని సంస్కరింపగలరు. వారు తమ దినదినాభివృద్ధిని గుర్తించగలరు. నూలు లెక్కకూడ చేర్చుకొనగలరు. చరఖా సంఘము వారి సహాయమున కాంగ్రెసు సంఘములు తమ కార్యాలయముల వ్యవస్థయందు అవసర మార్పులుకలిగించి వాటిని నేయుట మరియు వడుకుటయొక్క కేంద్రములుగా జేయగలవు.

తమదారమును, నేతకై దూరప్రదేశములకు పంపగూడదని నేను కాంగ్రెసుసంఘముల కార్యాలయములను హెచ్చరించుచున్నాను. ఇట్లుచేయుట పొరపాటు. ఖాదీ అర్థశాస్త్రముననుసరించి పత్తి పండించుట మొదలు ఖాదీ నేయ

బడి అమ్ముడుపోవువరకు అన్నిపనులు అదే గ్రామములోగాని, లేక కేంద్రములోగాని జరుగవలెను. పంజాబులో వడికిననూలును బొంబాయిలో నేయించి మలబారులో అమ్మటతప్పు. ఖాది కార్యమును ప్రారంభించుటకుముందు కాంగ్రెసుసంఘములు చక్కని ఖాదిసూత్రములను అర్థముచేసికొని తమదృష్టియందుంచుకున్నచో రాబోవుకష్టములకు అధైర్యపడరు. వారికి తమజిల్లాలో విజయముకలిగెనేని మిగతా (౮౯)జిల్లాలలో విజయము చేకూరకపోవుటకు కారణముండదు.

ఒక్కగ్రామమునే కేంద్రముగాగొని కార్యక్రమము నారంభించినను పైవాదము నిలుచును. నిజమేమన ఇంకను మనము ఈపద్ధతిపై గ్రామములను వ్యవస్థపరుపలేదు. స్వయముగా నేనక్కడయున్నను, సేవాగ్రామ్ పరిస్థితిగూడా అటులనే యున్నది. కాని నా ఈ అపజయమునుజూచి, తన గ్రామమును వ్యవస్థపరచుటకును, ఉద్ధరించుటకును పూనుకొన్న కార్యకర్త ఎన్నటికి అధైర్యపడగూడదు. నిరాశజెందగూడదు.

---

## ఖాది ఉద్యమమునుగూర్చి
# జవహర్లాల్ నెహ్రూగారి లేఖ

(మీరటులోని గాంధి ఆశ్రమకార్యదర్శియగు శ్రీ విచిత్ర నారాయణ శర్మగారికి డేరాడూన్ జైలునుండి పండిత జవహర్లాలుగారు, ఖాది ఉద్యమమునుగూర్చి పంపిన ఒకముఖ్యమైన ఇంగ్లీషు లేఖకు ఆంధ్రీకరణము)

నా ప్రియమైన విచిత్రనారాయణా!

మీ ఉత్తరము ముట్టినది. సంతోషించితిని. కాని జైలునుండి నా సందేశము నాశించుటజూచి ఆశ్చర్యమగుచున్నది. అట్లుజరుగదు. జరుగనీయబడదు కూడా. ఈవిషయమున నాపై అనుగ్రహముజూపినను నేనట్టి అనుగ్రహముతో లాభముపొందను. ప్రజాహిత కార్యమునకై నేను సంపూర్ణముగా స్వతంత్రుడనైన గావలెను లేదా పూర్తిగా పరాధీనుడనైన గావలెను. ఏకసమయమున రెండును పొసగుటెట్లు? ఇంతేల నేను జైలులోనున్నంతవరకు మీకు నా సందేశము లభించజాలదు.

### ఆశీర్వచనములు

మీయెడనాకు సుహృద్భావముగలదు. కాని జైలునుండి మార్గదర్శకత్వము చేయలేను. ఖాది అభివృద్ధినిజూచి సంతోషమగుచున్నది కాని తీవ్రముగా అభివృద్ధిజరుగనందులకు విచారమగుచున్నది. పనిచేయుపద్ధతిలో మనముపూర్తిగా పూర్వాచారపరాయణుల మగుటలేదుగదా యని

ఒక్కొక్కప్పుడు అనుమానము కలుగుచుండును ప్రతివటుఒకటే రకపు ప్రచారము. అదేవ్యక్తులు అదేవిన్నపములు. గ్రామ కులుగూడా పాతవారే. ఇంతేల భూతమువలెనె వర్తమానము. మార్పు ఏదేని జరిగినదనిన అది కేంద్రకార్యాలయమును గోసాయిగంజుకు మార్చుట. ఇంతవరకు నేనువ్రాసినది ఒక్క మన సంయుక్త ప్రాంతమునకేగాదు. ఇవి దేశమంతటికి నివర్తించును. కొంచము బుద్ధికుశలత, విశాలదృష్టి మరియు దైనందినపరిస్థితులను బాగుగాపరిశీలించుట అన్నిచోట్లను అవసరమనిపించుచున్నది. యుద్ధకాలమునందు ఖాదిఉద్యమము పరుగెత్తవలసినమాట.మనమెక్కడ పోరబడుచున్నాము? ప్రస్తుతపరిస్థితులకు అనుగుణ్యముగా నడుచుకొనుటలేదా? అను ప్రశ్నలకు సరియైనప్రత్యుత్తరము లభించునట్లు ఆయా ఉద్యమములనుగూర్చి విచారించుటలేదు. అందుకునాకెంతో విచారము కలుగుచున్నది.

మూడు సంవత్సరములకు పూర్వము చైనాదేశములో, గృహపరిశ్రమలను సాగించుటకై పారిశ్రామిక సహకారసంఘముల స్థాపించుటకు ప్రభుత్వ ప్రభుత్వేతర మిశ్రప్రయత్నములు సాగియుండెను.

అక్కడి ఈఉద్యమమునకు యుద్ధముతో సన్నిహితసంబంధముండి మనతో పోలికలేకున్నను, సహకారపద్ధతిన ప్రారంభమై, ఇంతటివ్యాప్తి జెందుటజూడ ఆశ్చర్యముకలుగక మానదు, నేడు విజయవంతముగాసాగుచున్న సహకారసంఘములు (౨౦,౦౦౦)లకు పైగానున్నవి. ఇవిజపాను ఆక్రె

మితగ్రామములందున్ను సక్రమముగా పనిచేయుచున్నవి. ఈఉ ద్యమము చైనాను "ఆర్థికమరణము" నుండి తప్పించినది. ఇంతేల ఈ ఉద్యమము సైనిక పోరాటముకన్న ఎక్కువ పరిణామ కారి కాగలదు.

చైనాలోని ఈ ఉద్యమములో సమయానుకూలత కా ననగును. కనుకనే అది దావానలమువలె అంటుకొన్నది. పిల్ల లకు బలమునిచ్చుటకై పాలు త్రాగించునటుల ఈ అగ్నిజ్వాల లను తీక్ష్ణము చేయుటకు ఆజ్యము అవసరములేదు.

చైనాలోని పారిశ్రామిక సహకారసంఘములకు మనఖాది ఉద్యమముతో పోలికలేకున్నను, వారిదృక్పథము, కార్యాచరణ విధానం రెండును వేర్వేరుగానున్నను, సంయుక్తాంశములనేకము లున్నవి. వాటివలన మనమెంతో గుణపాఠముతీసికొనవచ్చును.

చైనా విషయమును ఉదాహరణముగా చెప్పితిని. నేటి ఈకాలమున మన మస్తిష్కములకు ప్రతిష్టంభన కలుగజే యుట అనగా వాటితో ఏమాత్రముపని తీసికొనకపోవుట మూర్ఖత్వము. మన దేశమునందలి కోట్లకొలది ప్రజలకు ఖాది ఆశాజ్యోతి యని నానమ్మకము. మనము తీవ్రముగాను, లోతుగాను ఈసమస్యను విచారించనిచో, ఈకోట్లకొలది ప్రజ లను మనము సమీకరించుటయెట్లు? అనిఅనుమానముకలుగును.

నావలెనె రంజీతుగూడా సందేశము పంపజాలడు. తన శుభ చింతలనుమాత్రము తెలియచేయుచున్నాడు కదురుతో దారము తీయుకొరకు కొంతిఉన్ని పంపుమని ఆతేడుమిమ్ముల కోరుచున్నాడు.

ఇట్లు తమ
జవాహర్లాలు నెహ్రూ

# ప్రమాణిత ఖాది — మరియు — అప్రమాణిత ఖాది

అఖిలభారత చరఖాసంఘ కార్యదర్శులైన

శ్రీకృష్ణదాసు జాజుగారు

బట్టసిద్ధమైన తరవాత చేతిదారములోను మరియు గిర్ని దారములోనుఉండు భేదమును గమనించవలసియుండును. తక్కువతక్కువ కూలిఇచ్చి ఖాది సిద్ధముచేయించినప్పుడుకూడా గిర్నిబట్టకంటె ఖాది ప్రియమగుచుండెను. కాని ముఖ్యమగు జీవితావసరములను తీర్చుకొనుటకు చాలినంతకూలి నియ్యవలెనను తత్త్వమును ఒప్పుకొందుమేని దొడ్డు ఖాదివెలకూడా గిర్నిబట్టకన్న మూడింతలు ఎక్కువగును. ఇక సన్నఖాది ధర ఇంకను ఎక్కువ కాగలదు.

ఇట్టిపరిస్థితిలో స్వార్థులైనవారికి జనసామాన్యమును మోసగించుట కవకాశము నియ్యకూడదను దృష్టితోను, జనులకుశుద్ధమైనఖాదిఅంద జేయుఉద్దేశముతోను, చరఖాసంఘము అస్తిత్వములోనికివచ్చినది. ఖాదీ ఉత్పత్తిమరియు అమ్మకము మీద పర్యవేక్షణసల్పుచు ప్రమాణ(ధ్రువ) పత్రములను ఇచ్చుట చరఖాసంఘముయొక్క ముఖ్య కర్తవ్యమైయున్నది.

ప్రమాణపత్రము కేవలము ఖాదిబట్టకే ఇవ్వబడదు ఎవరికిఖాదియెడ ప్రేమయున్నదో? ఎవరు ప్రజాసేవచేయుటకు ఆతురులై యున్నారో? ఎవరు గిర్నిదారమును, చేతితోవడికిన దారముతో కలపక చరఖాసంఘము నిర్ణయించినకూలిని

తప్పక ఇచ్చుచుందురో అట్టివారికికూడా ప్రమాణపత్రము ఇవ్వబడును.

భారమువడుకు ఆడవాండ్రు ఇదివరకు రోజుకు (౮) గంటలువడికి, నెలకు మూడుపాయిలకూలితో తృప్తిపొంద వలసియుండెను. పనిఏమీ దొరకనప్పుడు కడుపుమంట చల్లార్చు టకు ఈ కొద్దికూలకికూడ పనిచేయుచుండెడివారు. ఇప్పుడు కూడ అందుకు వారుసిద్ధముగా నున్నారు. అయినను చరఖాసం ఘము ఎవరిఒత్తిడిలేకయే తనంతటతానే రోజుకు మూడణాల చొప్పున కూలిఇచ్చుటకు ఆరంభించినది. ఈ విశాలప్రపంచ ములోని ఏ వ్యవహారమందుకూడా ఇట్టిఘటన జరుగకుండవ చ్చును. చరఖాసంఘము "కడుపునిండేకూలి" ఇచ్చుసూత్రి మును ప్రయోగించుటకు ప్రయత్నముచేయుచున్న సమయ మున స్వార్థపరులైన కొందరు అప్రమాణితఖాది విక్రయ వ్యాపారము సాగించుచు లాభముగడించుచున్నారు. అంతే గాదు వాతావరణమును కలవరపరచుచున్నారుగూడా.

ఖాదీ తత్వదృష్టిలో ఇదియొకఘోర అపరాధము. ప్ర మాణితఖాది వ్యాపారముచేయువాడు ఎంత హానికలిగించునో- గిర్ని బట్టల వ్యాపారస్థుడేకాని లేక విదేశవస్త్ర వ్యాపారస్థుడే కాని అంతహాని కలిగించజాలడు. ఎందుకనగా ఖాదికొనువాడు గిర్ని బట్టలదుకాణమునకు వెళ్లనే వెళ్లడు. అతనికి కావలసిన వస్తువులక్కడ దొరకవని అతనికి తెలిసియేయుండును. కాని పొర పాటున అప్రమాణిత ఖాదీదుకాణమునకు పోవుటసంభవము.

ఇక శుద్ధఖాదిపేర నకిలీఖాది అనగా అప్రమాణితఖాదిని అతనికి అంటగట్టుటకు వీలున్నది అయిన ఎవరికిని శుద్ధఖాది అవసరము లేదో? ఎవరికి కేవలము 'ఖాదిదారి' యనిపించుకొని బాహ్యాడంబరము చేయవలసియున్నదో వారికిమాత్రము ప్రమాణపత్రముపొందని ఖాదివ్యాపారస్థుడు అనుకూలముగానుండును. ఈఅప్రమాణితఖాది వ్యాపారస్థులు స్వార్థపరులు. వీరిదితప్పుడుమార్గము. ఖాదీ తత్త్వమునకు వీరినుండి కలుగుహాని ఇంతంతకాదు. ఇటీవల హైదరాబాదకు పోయినప్పుడు అప్రమాణితఖాది వ్యవహారముయొక్క అనుభవమునాకు కలిగినది. మెట్టుపల్లిలో ౪గురు ౫గురు నేతగాండ్రుకలిసి, రెండు అప్రమాణితఖాదీ కార్ఖానాలను తెరచియున్నారు. వారు స్వయముగా నేయుటలేదు. ఇతరులు నేసినబట్టనుగాని వడకినదారమునుగాని వ్యాపారదృష్టితో కొనుచుందురు. వీరు వడికె (ఆడవాండ్రకు) వారికిని నేతగాండ్రకును చరఖాసంఘమువారిచ్చు కూలీలో రెండోవంతు, నాల్గవవంతు క్రమముగా తక్కువ ఇచ్చుచున్నారు. ఇక్కడి వ్యాపారస్థులు తమబట్టను హైదరాబాద, సికింద్రాబాద, వరంగలు, కరీంనగరము మున్నగు స్థలములలోని వర్తకులకు అమ్మెదరు. వారు చరఖాసంఘపు ఖాదీ దుకాణములతో పోటిచేయుచున్నారు. ఇందు నూటికి నలభైవంతున లాభము దొరకుచున్నది. ఈలాభము మెట్టుపల్లి మరియు ఇతరస్థలములలోని వర్తకులకు జెందుచున్నది, నగరవర్తకులకును జెందుచున్నది. నగరవర్తకులు చరఖాసంఘము

కన్న కొంచము తక్కువధరకుబట్ట అమ్మెదరు. వీరిధరలలో అనా అణాన్నర భేదముండును. ఎక్కడ భేదముచాలా ఉండునో అక్కడసామ్యముకూడ అంతపాటిదేయుండును. కనుక నూటికి ౧౦ వంతులు చౌకయైనప్పటికిని దొరకులాభమైనను ఎంత టిది? ఈ స్వల్పలాభముకొరకు ఖాదియొక్క పవిత్రకార్యము నకు ఎంతటి హానికలుగుచున్నదో గమనించుడు.

వారికి ఖాదీయందు నిజమైన ప్రేమ, విశ్వాసములు యుండెనేని ఈ నూటికి ౧౦ తక్కువ చేయుకనే వ్యవహారము నడుపవచ్చును. చరఖాసంఘపు నూరు రూపాయిల ఖాదీ ఉపయోగము చేయుటచే బీద కూలివాండ్రకు డెభై రూపా యిలు ముట్టుచున్నవి. అందుకు బదులుగా అప్రమాణిత ఖాదీ కొందుమేని (౨౫) రూపాయిలు మాత్రమే చెందు చున్నవి.

అప్రమాణిత ఖాది ఉపయోగించినచో గిర్నికంటె నుమారు రెండింతలు ఖర్చుచేయవలసి వచ్చుచున్నది. ఖాదీ కొరకే ఇంత ఎక్కువ ఖర్చుచేయుటకు సిద్ధమైనపుడు ఖాదీ తత్వమునకే భంగము కలిగించి ఇందులో నూటికి ౧౦ వంతున మిగుల్చుకొనుటలో అర్థము లేదు.

అప్రమాణిత ఖాదీ అమ్మువారు కల్తీలేని శుద్ధఖాదిని ఉత్పత్తిచేయుటకేమి ఏర్పాటు గావించి యున్నారు? వారికా శ్రమగైకొనుటకు అవసరమేమిగలదు. వారు ఈ వ్యవ హారమును ఖాదీతత్త్వ దృష్టితో చేయుటలేదు. వారికి నేమ

లాభముతో పని. ఖాదీతత్త్వ దృష్టితో రాత్రిం బగళ్ళు సేవ చేయు కార్యకర్తల అపారమైన త్యాగముయొక్క ఫలమును అన్యాయముగా ఈ స్వార్థపరులు ఇట్లు కొల్లగొట్టుచున్నారు.

అప్రమాణిత ఖాదీ వర్తకులకు గిర్ని దారమును చేతి దారములో కలువకుండ ఏర్పాటుచేయు చింతయుండదు. గిర్ని దారము మరియు చేతిదారముల వెలలో చాల భేదముండుటచేత మోసముచేయు మనోవృత్తి ప్రబలియుండుట సహజము కనుక వీరివద్ద శుద్ధ ఖద్దరు దొరుకునని నమ్ముట తమ్ముతాము మోసముచేసి కొనుటయగును.

---



---

### ఆర్థిదాస్య విమోచనకు

# ఖాది ఏకైక సాధనము

ఖాది తొడుగుట మన కర్తవ్యముగాని ఉపకారము జేయుటగాదు.

హైదరాబాదు ఖాది ప్రచారసంఘ కార్యదర్శులైన

**శ్రీ రామకృష్ణధూత్ గారి వినంతి.**

---

౧౯౩౮ లో స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహులు జైలు నుండి విడుదలైన తర్వాత మహాత్ముని ఆదేశానుసారము ఖాది ప్రచార కార్యమును ప్రారంభించిరి. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమములో ఖాది పరిశ్రమాభివృద్ధి ముఖ్యమైనది. గాంధి మహాత్ముడు దీనిని ఎప్పుడును రాజకీయములనుండి వేరుగా నుంచుచు వచ్చినాడు. కనుక ఖాది ఉద్యమము ఏదేని ప్రత్యేక మతము లేక వర్గమువారికి సంబంధించినది గాదని నిస్సంశయముగా చెప్పవచ్చును. అందుకనియే హైదరాబాదు సత్యాగ్రహులు జాతీయవారము, గాంధి జయంతి, మరియు మ. ఘ. వ. నిజాం ప్రభువుగారి జన్మదినము మొదలగు సందర్భములందు ఖాది ప్రచారము చేయుట తమ కర్తవ్యమని భావించిరి. రాష్ట్రము నందంతటను ఖాది ప్రచార సంఘ శాఖలు స్థాపింపబడి, ప్రమాణిత ఖాదియొక్క ఉద్దేశ ఆశయములు జనసామాన్యమునకు తేటపరుపబడెను. మన దేశమునందు దారిద్ర్యము ఎక్కువగుచున్నది. డగ్బి గారనినటుల హిందూ దేశములోని కోట్లకొలది ప్రజలు కూడు

లేక రాత్రిపూట ఉపవాసము చేసెదరు. మానరక్షణకైన వారికి బట్ట దొరకదు. ఇట్టి ఘోరదారిద్ర్యమును దూరము చేయుటలో చరఖా సంఘమువారికి తోడ్పడుట ప్రతి దేశ భక్తుని కర్తవ్యముగదా! మీరెంత సహాయము చేసెదరో చరఖా సంఘము బీదలకు అంతఎక్కువ సహాయము చేయగలదు. ఇది కేవలము ఆర్థిక సమస్య. ఇందు మతమునకు గాని, మత పక్షపాతమునకుగాని ఏమాత్రము చోటు లేదు. అఖిలభారత చరఖాసంఘ యాజమాన్యమున హిందూదేశము నందంతటను ఖాది కార్యక్రమము సాగింపబడుచున్నది. కాంగ్రెసు పోషకత్వము తప్పకగలదు. కాని ఈ సంస్థకు రాజకీయములతో ఏమాత్రమును సంబంధము లేదు. కాంగ్రెసుకు జీవనాధారుడైన మహాత్ముడు ఈ నిర్మాణ కార్యక్రమమును రచించినంతే మాత్రమున దీనిని కాంగ్రెసు కార్యక్రమమని భావించి నిస్పృహజూపుట ఉచితముగాదు. ఖిలాఫతు ఉద్యమము నడిచిన రోజులలో ఇతర సంస్థలును ఈ కార్యక్రమమును అంగీకరించి యుండెను. జాతిమత విచక్షణలేక హిందూ, మహమ్మదీయ, సిక్కు మొదలగు అన్ని జాతుల బీద ప్రజలను సుఖజీవనము గడుపునట్లు చేయుటయే మా ఉద్దేశము. కనుక మీరు మాతో తప్పక సహకారము నల్పెదరని ఆశించుచున్నాను.

ఇంకొక విషయము తమ దృష్టిలోనికి తేవలసి యున్నది. మన, జాతీయవారము లేక మహాపురుషుల జన్మదిన

సందర్భములందు ఖాది వ్యాపకము కొరకు చరఖాసంఘ పక్షమున "ఖాది హుండీ"ల విక్రియ వ్యవస్థ చేయబడును. ఖాది ప్రచారము ఎక్కువ కెక్కువ జరుగుటకును, నియమిత సమయమున పీలునుబట్టి ఇష్టప్రకారము ఖాది కొనుటకు పీలుకలుగ జేయుటకును, కార్యకర్తల దృష్టిని ప్రత్యేకముగా కేంద్రీకరింప జేయుటకై పడాది పొటున పదో కొన్ని రోజులు ప్రత్యేకింపబడును.

ఈ మాఉద్దేశమును కొందరు తప్పుడు అభిప్రాయము చేసికొను చున్నారు. కార్యకర్తలు ఖాది హుండీలు తీసికొని ఇంటింటికి తిరుగుటచూచి కొందరు దురభిప్రాయపడుచున్నారు. ధర్మార్థమైన సినిమా, నాటకు టిక్కట్లవలె ఖాది హుండీలనుగూడా దానములో లెక్కగట్టెదరు. కాని అట్లుచేయుట సరికాదు. కార్యకర్తలు తిరుగుచు ఇంటింటికి ఖాది సందేశమును అందజేసెదరు. మీ సౌకర్యమును దృష్టియందుంచుకొని మీరున్నచోటికే ఖాదిని అందజేసెదరు. ఇక ఖాదికొనునప్పుడు, కార్యకర్తలకుగాని బీదగ్రామప్రజలకుగాని ఉపకారము చేయుచున్నామని తలచుటతప్పు. ఖాదిని సేవాదృష్టితో కొనవలెను. ఖాదికొనుట మనవిధియని తలచవలెను. ఈ ఉద్దేశముతోనే పవిత్రమైన ఉద్యమమునకు చేతనైనంత సహాయము చేయవలెను. ఎండలో మండుచు, వానలో నానుచు, చలిలో వణకుచు గ్రామవాసులు పట్నవాసుల కొరకై పడరాని పాట్లుపడుచుండ

వారికి కడుపునిండ కూడుదొరుకునట్లు చేయుటకు నాగరికులు సహాయ పడవలదా? చరఖాసంఘపు దుకాణములనుండిగాని వారి ఏజంటుల నుండిగాని ప్రమాణిత ఖాదిని కొన్నచో ఈ ఉద్దేశము ఫలించును. అనగా మీరు ఖాదిపై వెచ్చించు ఒక్కొక్క పైస బీద ప్రజలకు జెందును. చివరకు, ఖాది ఉద్యమముయొక్క మూలోద్దేశ ఆశయములను బాగుగా అర్థము చేసికొని ప్రమాణిత ఖాదిని అభివృద్ధి పరచుటకు శక్తివంచనలేకుండ ప్రయత్నించ గలరని నేను హృదయ పూర్వకముగా విన్నవించుకొనుచున్నాను.

---

# రాట్నము

శ్రీరామకృష్ణ ధూత్ గారు.

అఖిలభారత చరఖాసంఘముయొక్క మహారాష్ట్ర కర్నాటక శాఖలు మెట్టుపల్లి, గద్వాల మొదలగుస్థలములందు చాలాకాలముక్రింద స్థాపితమై పనిచేయుచున్నవి. ఒక మెట్టుపల్లిలోనే ౪౦-౫౦ వేల రూపాయలఖాదీ సిద్ధమగుచున్నది. దీనివల్ల ౬౬౯౭ మందికి స్థిరమైన జీవనోపాధి కలుగుచున్నది. వీరిలో ౧౦౬౭ మంది మహమ్మదీయులు కలరు. వీరుగాక ౪౦౦౦ మంది కూలీలు తాత్కాలికముగా జీవనాధారము పొందుచున్నారు. సగటుమీద నూలువడకు ఒక్కొక్కరికి నెలకు రూ. ౬, బట్టనేయు ఒక్కొక్కరికి నెలకు రూ. ౨౧-౮-౦, ఒక్కొక్కచాకలికి రూ.౮, దూదిఏకు ఒక్కొక్కరికి నెలకు రూ.౧౧-౮-౦. రంగువేయు వారొక్కొక్కరికి నెలకు రూ ౯, దొరకుచున్నవి. ౧౯౪౧ సంవత్సరమున ౫ లక్షల రూపాయిల ఖాదీ సిద్ధముచేయబడినది. ఈ సంవత్సరములో ౬ లక్షల వరకు తయారుకాగలదని ఆశించుచున్నాము. కాని మన రాష్ట్రములోమాత్రము గత సంవత్సరము ౧ లక్ష ౨౦ వేల ఖాదీమాత్రమే అమ్ముడుపోయినది. మిగతసరుకు బయట పంపబడినది. మనఖాది ఇతరులకవసరముండనిదినము ముందు రావచ్చును. అప్పుడు మనదగ్గర మిగులుఖాది ఎవరుతీసుకొనెదరు. ఈ విషయమును గమనించియే హైద్రాబాద ఖాదీ ప్రచారసంఘమువారు ఖాదీ ప్రచారమునకు పూనుకున్నారు. ప్రతిధర హెచ్చుకున్నను గిర్నియజమానులు తమబట్టలధర

ఎక్కువచేసినారు. నిజము విచారించిన నేటికాలమున ఖాది గిర్ని బట్టలకంటె చౌకగానున్నది. కనుకనే ఖాదీగిరాకి ఎక్కువగుచున్నది. ఖాదీకిగిరాకి ఎక్కువయున్నదిగనుక ఖాదీవాడుకొనుట ఎందుకని తాము తలచరాదు.

పైచూపిన పరిస్థితుల నెదుర్కొనుటకై సాధ్యమైనంత ఖాది ఉపయోగించవలయును.

బీదకూలీలకు వారి ప్రాథమికావసరములకు తగినంతకూలి ఇచ్చుటయే చరఖాసంఘముయొక్క ఉద్దేశ్యముకాని లాభము సంపాదించుటకాదు. ఇందుకు విరుద్ధముగా అపరిమాణితఖాదీ వుత్పత్తిదార్లు కూలీలకుతక్కువ ప్రతిఫలమిచ్చుచున్నారు. జనసామాన్యము ఎంతఎక్కువ ఖాదీవాడెదరో అంతయెక్కువఖాది ఉత్పత్తిచేయబడును. ఎక్కువ ప్రతిఫలముపొందువారి సంఖ్యకూడా అభివృద్ధిచెందును.

ఎనిమిదిగంటలు పనిచేయు ప్రతికూలికి అధమపక్షము ఎనిమిదణాలకూలీ దొరకవలయునని గాంధీమహాత్ముని అభిలాష. కాని చరఖాసంఘమువారింతవరకు అపరిమిత ప్రతిఫలము ఇవ్వజాలరైరి. ఐనను ఇప్పుడు కనీసము మూడణాల కూలీ ఇచ్చుటయేగాక ప్రతిసంఘముయొక్క కేంద్రస్థానములందు కూలీలకొరకు వైద్యాలయములు తెరువబడినవి.నిత్యావసరవస్తువులను చౌకగా అమ్ముటకు దుకాణములు తెరువబడినవి. వారిపిల్లలకు చదువునేర్పుటకై బళ్లు తెరువబడినవి. అందు చేతిపనులుకూడా నేర్పబడుచున్నవి. మొట్టువల్లిగాని,

మరియే కేంద్రమునైనను దర్శించువారు చరఖాసంఘమువారి ఈకృషినిచూచి తృప్తిపడగలరు.

చరఖాసంఘవు ఉద్యమములకు మతపాక్షిక భావములతో ఎట్టిసంబంధము లేదు. చరఖాసంఘము కాంగ్రెసువారిచే స్థాపితమైనందున, అది ప్రత్యేకముగా కాంగ్రెసువాదులసంస్థ అనియు, కాంగ్రెసుతత్వముల ప్రచారము చేయుటకై ఏర్పడినదనియు,తలంచుటసరిగాదు. దేశములోని దారిద్ర్యముపోగొట్టుటకే చరఖాసంఘము స్థాపింపబడినది. రాష్ట్రములోని హిందూమహమ్మదీయులుఏకమై చరఖాసంఘతత్త్వమును ప్రచారము చేసినఎడల నిరుద్యోగసమస్య రూపుమాసిపోగలదు. చరఖాసంఘమువారు కూలీనహెచ్చించుటకు ప్రయత్నించుచున్నారు. జీవనము గడుపుటకు కాలినంతప్రతిఫలము పొందుచు పనిచేయుటకు విద్యాధికులను ప్రోత్సహించుచు జయముపొందుచున్నారు. చరఖాసంఘముయొక్క మూలధనము చందాలవల్ల చేకూర్చబడును. అది ఎవరివద్దను వడ్డీకి అప్పుతీసికొనదు. సంవత్సరాంతమున లాభమున్నట్లు తేలినపక్షమున, అట్టిమొత్తము బీదల సహాయమునకై వినియోగింపబడును. కనుక హైదరాబాదలో మంచి కార్యకర్తలు కావలసియున్నారు. కార్యకర్తలువున్నచో ద్రవ్యము తప్పక రాగలదు. హైదరాబాదు రాష్ట్రమునందు ౫౦మంది కార్యకర్తలున్నచో స్వతంత్రశాఖఏర్పడగలదు. ఈఉద్దేశ్యముతోనే మెట్టుపల్లిలో ఒకశిక్షణ శిబిరము తెరువబడినది. అందు ప్రస్తుతము పది

మంది కార్యకర్తలు శిక్షణపొందుచున్నారు. [illegible]లము ఏడుస్థానములు. మనరాష్ట్రములో నూలువడుకువారు తక్కువగాని బట్టనేయువారు తక్కువలేరు. నూలువడుకువార్లు తగినంత సంఖ్యలో దొరకిన ఈ రాష్ట్రమునుండి దారిద్ర్యమును పారదోలవచ్చును. చరఖాసంఘమువారు ఖాదిప్రచారసంఘమువారి సిఫారసుపై యోగ్యులగువారికి విద్యార్థివేతనము నిచ్చెదరు. పేదవారిపై దయగలవారు ఈ శిక్షణ శిబిరము నుండి జనసామాన్యము లాభముపొందునట్లు చేయగలరని ప్రార్థించుచున్నాను.

---

# 'దేశోద్ధారక' గ్రంథమాలవారి

జాతీయ పుస్తకములు తప్పక చదువండి—.

| | |
|---|---|
| నా భారత దేశయాత్ర | ౮ అణాలు |
| ప్రాథమిక సత్యములు | ౫ ,, |
| ఔంధు సంస్థానము | ౫ ,, |
| కమాల్ పాషా (౧) భా | ౧౨ ,, |
| గాంధి మహాత్ముడు (౨) భా | ౧౨ ,, |
| సంస్థాన సమస్యలు | ౬ ,, |
| కాంగ్రెసు - సంస్థానములు | ౬ ,, |
| ప్రజలు - ప్రభుత్వము | ౬ ,, |

"ఇవి ఆంధ్ర పబ్లిషింగ్ కంపెని, సుల్తాన్ బజారు హైదరాబాదు - ." లో దొరుకును.

# నిజాం రాష్ట్రమునందు
# రాట్నము — ఖాది
## శ్రీ. శ్రీ. నవాబు సర్ అక్బర్ హైదరీగారి అభిప్రాయము

---

### గాంధి మహాత్ముని అభినందనము.

---

౧౬-౧౨-౧౩౩౮ ఫసిలీనాడు సమావేశమైన నిజాం రాష్ట్ర సహకార మహాసభ అధ్యక్షోపన్యాసము గావించుచు శ్రీ. శ్రీ. నవాబు సర్ అగ్బరు నవాబుజంగు బహాదురు గారు రాట్నము మరియు ఖాదినిగూర్చి ఈ క్రిందివిధముగా సెలవిచ్చి యుండిరి.

మన గృహపరిశ్రమలవైపు మీ శ్రద్ధ మరల్పదలచితిని అవి అన్నిటికన్న ఎక్కువ అవసరమైనవి. వాటిని సంరక్షించుట, మరియు వాటికి సహాయముచేయుట సహకార సంఘముల ముఖ్యధర్మము. ఇది అన్నిటికన్న ముఖ్యమైనది. మంచి పనిముట్లు, ముడి పదార్థములు సమకూర్చి విక్రయించుటకు వ్యవస్థ నల్పునట్టి సంఘములు స్థాపించినచో దేశమున కెంతో మేలుకలుగును. ఉదాహరణముగా, పల్లెటూరి ప్రజలలో దారము వడుకుట, మరియు బట్టనేయుటను పునరుద్ధరించినచో-ఒక పెద్ద చేసినటులగును. కొంత కాలమునకు పూర్వము వడుకుట మన దేశమునందు విరివిగా ప్రచారము నందుండెను. బీదలేగాక సంపన్న కుటుంబములకు జెందిన

స్త్రీలును తీరిక సమయములందు దారము వడుకుచుండెడి వారు. జాజంలు, దస్తరు ఖానులు, చాందినీలు, మొదలగు వాటిని పెద్దఇంటి బిడ్డలు తాము వడికిన దారముతో నేయించుకొనెడివారు. గౌరవనీయులగు గృహిణులు దారమువడికి, బట్టలుకట్టి తమను, తమ బిడ్డలను పోషించుకొనెడివారు. కనుక మీరు గృహపరిశ్రమలను ప్రచారములోనికి దెచ్చినచో జన సామాన్యముయొక్క జీవితమును సుఖవంతము చేయుటయేగాక, వారి తీరిక సమయములందు పనికల్పించుచు వారిని దుర్మార్గములనుండి రక్షించినవా రగుదురు. బాధ్యత గల మీ శాఖోద్యోగులు ఈ సంవత్సరమునుండియే ఈ పని ప్రారంభించగలరని నేనాశించుచున్నాను. వచ్చే సంవత్సరపు నివేదికను నేనతి శ్రద్ధతో చదువగలను. అందు ఇట్టి ఉత్తమ కార్యమును ఎందరు సహృదయులు ప్రారంభించెదరో చూడగలను.

అధ్యక్షకోపన్యాస సందర్భమున సర్. అక్బర్ హైదరీ గారిట్లు ప్రకటించి సందులకు అభినందించుచు గాంధి మహాత్ముడు ఇట్లు సెలవిచ్చి యున్నాడు.

"మైసూరువలె రాష్ట్రమును అభివృద్ధి పరచుటలో హైదరాబాదు రాష్ట్రము పాటుబడగలదని నే నాశించుచున్నాను. వడుకు విషయమున సఖ్యతచూపుట సునాయాసము. ఖాదికి సహాయముచేసినచో అట్టి సఖ్యత చిరస్థాయియగును. దారము వడుకువారి సంఘములందు అడుమబడిన

దూది గట్టాలకు బదులు పత్తిని(గింజలతో నున్నది) తెచ్చి పెట్టవలెను. అంత దారము తీయువారు, పత్తితో పనులు వడకెదరు. కాని వారు మొట్టమొదట పత్తిని తమ చేతులతో శుభ్రపరచినచో అట్టి సంఘములందు దూదేకులవారు యుంచబడెదరు. అవసరమైన పనిముట్లు అనగా పత్తిగింజల గిరక, దూదేకుటకు ఉండేల, రాట్నము, మరియు వీటిని బాగు చేసికొనుటకు వలయు పనిముట్లు సరఫరా చేయబడును. ఇట్టి ఖాదీ కొట్టునుండి(గోదాము)వస్తువులు సరఫరాచేయబడును, సమకూర్చబడును, మరియు విక్రయింపబడును. ఈ కొట్టులో సభ్యులు వడికినదారము కొనబడును. వారు నేసిన బట్ట అమ్మబడును. వడుకునట్టి సభ్యులకు ప్రత్యేకవు తగ్గింపుధర పై బట్ట అమ్మబడును. ఇక జనసామాన్యముతో సాధారణధరతీసికొనబడును. ఇట్టిసంఘములు ప్రభుత్వ యాజమాన్యమునగాని, సహాయమునగాని (అంతలేకకొంత) స్థాపింపబడినచో ప్రజల సఖ్యతకు అనేకఅవకాశములు తప్పకగలవు. అధికారులు ఖాదియెడసహృదయులని ఇంతటితో ఊహించవచ్చును. అనగా అధికారులపట్టికలో మార్పు అవసరము. జనసామాన్యము ఏ అధికారులకొరకు ఉపవాసము పడునట్టి అత్యంత సాధారణమైనకూలి తీసికొని కష్టపడి చెమటకార్చెదరో అట్టి అధికారుల హృదయములందు జనసామాన్యముపట్ల ప్రేమ భావముండవలెను. కాగు జనసామాన్యమునకు విశ్వాసపాత్రులై యుండవలెనేగాని రాజమాలుగాను, అధికారులుగాను యుండరాదు. సర్. అక్బర్ నవాజజంగు బహాదురుగారి అధ్య

త్తో పన్యాసములో కనబడుఉత్సాహము అధికారులపైకూడా పరిణామము కలిగించునేని హైదరాబాదరాష్ట్ర రైతు భవిష్యత్తు సంతోషకరముగానుండును.

మైసూరువలెగాక హైదరాబాదులో పత్తి బాగుగా పండును

## మీకు తెలియునా?

ఒక్క రూపాయి వెలగల ప్రమాణిత ఖాది కొన్నచో మన రాష్ట్రములోనే నివసించునట్టి వివిధవర్గములకు చెందిన వ్యక్తులలో నెట్లు పంపిణయగునో మీకు తెలియునా? లేనిచో ఈ అంకెలను గమనించుడు —

౧౬ అణాలనుండి

౦-౩-౬ పత్తి ధర. వ్యవసాయకునికి

౦-४-౬ కూలి ఏకుటకు మరియు వడుకుటకు.

౦-౫-౦ నేత అద్దకము మరియు ఉతుకుటకు కూళ్లు.

౦-౩-౦ బాడుగ మరియు వ్యవస్థ (జీతములు.)

౦-౧౬-౦ అనగా ఒక్క రూపాయి

ఈ అంకెలను చూచి కూడా మీరు ఖాది కొనరా?

రండు—నేడే ప్రతిజ్ఞ గైకొనుడు.

"నేటినుండి నేను ప్రమాణిత ఖాది వస్త్రములనే ఉపయోగించెదను" అని — ఇట్లు

తమ విధేయుడు ,—

హై. ఖా. ప్ర. సంఘ. ఆంధ్రప్రాంత కార్యదర్శి.

# మహారాష్ట్ర చరఖాసంఘము

## మిస్టర్ గ్రిగ్సన్ ఐ. సి. ఎస్. గారి సంగ్రహనివేదిక

అప్పుడు హైదరాబాదురాష్ట్ర భూమ్యాదాయశాఖ డైరెక్టరు జనరల్‌గానున్న మి. గ్రిగ్సన్ ఐ. సి. ఎస్. గారు తమ సందర్భమున ౩౦ ఆగష్టునుండి ౮ సెప్టెంబరు ౧౯౧౯ వరకు గావించిన పర్యటనయొక్క సంగ్రహనివేదిక —

(౮ వ మద్దు). ఆసిఫాబాదురోడుకు సమీపమున రెబ్బన్నలోనున్న మహారాష్ట్ర చరఖాసంఘ కేంద్రమునుండి ౧౮ పరిసర గ్రామాలలోని సాలెవారికి పత్తి సరఫరాచేయు వ్యవస్థగలదు. సిర్పూరుతాలూకాలో మరియొక కేంద్రమున్నది. అచటగూడ (౧౮) పరిసర గ్రామాలలోని సాలెవారికి పత్తి సరఫరాచేయు వ్యవస్థయున్నది.

పోల్కపల్లి స్టేషనుకు ౭, ౮ మైళ్ళపైనున్న వాయిలాలు (హుజూరాబాదు తాలూకా, కరీంనగరము జిల్లా)లో మరియొక కేంద్రమున్నది.

గత సంవత్సరముచేసిన కరీంనగరముజిల్లా పర్యటన సందర్భమున, నేతకూలిని రెండింతలుచేయవలసినదని గాంధి మహాత్ముడు నొక్కిచెప్పినటుల నాకు తెలిసినది. ఇందుకు ఫలితముగా హైదరాబాదులో నేసినబట్టల అమ్మకము మొదటికన్న మూడవవంతు తగ్గెను. అటు చరఖాసంఘమునకు సంవత్సరములోపలనే బట్టలధర నాల్గవవంతు తగ్గించవలసివచ్చెను.

అయినను ఈ తగ్గినధర, గాంధిమహాత్ముని ఆదేశానుసార ము కూళ్ళు పెంచుటకు పూర్వముకన్న ౧౦౦కి ౫౦ వంతులు ఎక్కువగ నేయగును. ధర పెరుగుటవలనను, హైదరాబాదు ఖాది ఎక్కువగా అమ్ముడుపోవునట్టి నాగపూరు, బెరారు ప్రాంతములందు పంటలు చెడిపోవుటవలనను, ఈ జిల్లాలోని గ్రామాదులలో ఎచ్చెచట పని ఎక్కువనడచుటకును, సాలె వారి వ్యవస్థ జరుగుటకును వీలుండెనో అచటచటపని తగ్గించ బడెను ధరలు తగ్గుటవలన చరఖాసంఘము వారికిట్లు చేయ వలసివచ్చినచో ప్రభుత్వమువారు సహాయముచేయవలెను. అప్పుడుగాని సంఘము ఏదోవిధముగ ఆయాగ్రామములందు నేతపనిని విస్తృతపరచగలదు. బట్టలనుకొనవచ్చును. బట్టలను చౌకగా అమ్ముటకు దుకాణములను తెరువవచ్చును. లేదా క్షామనివారణకొరకు ఖాన్గిఫండులను ప్రోగుచేసి ఈబట్టను అమ్మించవలెను. పై సంఘమువారితో వివరముగా సంప్రతిం చవలసినదిగా డివిజను ఆఫీసరు (దువ్వం తాలుక్దారు)గారితో జెప్పనైనది. బీజాపురములో, సిర్పూరుతాలూకాలోని మలి పల్లిలో, చెన్నూరు తాలూకాలోని కిష్టపల్లి మొదలగు గ్రామాదులలో పట్టుబట్టల నేయువారుకలరు. వీరికి సంఘము తరపున సహాయము దొరకజాలదు. ఎందుకనగా పట్టు తయారుచేయుటలో హింసయగును. ఈ కరువుకాలములో వీరెట్లు జీవించుచున్నారో చూడవలసియున్నది. అవసర మైనచో వీరునేసిన బట్టలను కొనవలెను.

# అఖిలభారత చరఖా సంఘము

## నిజాం రాష్ట్రమునందు మహారాష్ట్రశాఖవారి కార్యకలాపములు

అఖిలభారత చరఖాసంఘ పక్షమున నిజాంరాష్ట్రము నందు ప్రమాణిత ఖాదినేయుట మరియు అమ్ముటనుగూర్చిన వ్యవస్థ అత్యున్నతముగా జరుగుచున్నను, కొన్ని సంస్థలపక్ష మున స్వార్థదృష్టితో అప్రమాణితఖాదిని నేయుట అమ్ముట విషయమున ప్రచారము జరుగుచున్నది. ఇది కష్టదాయక మగుటయేగాక ఖాదియొక్క మూల ఉద్దేశమునకే భంగము కలిగించునని అనుమానము గలదు. విదేశవస్త్రములు విక్ర యింపబడునప్పుడు దేశపు మిల్లు గుడ్డలనుగాని, అప్రమాణిత ఖాదినిగాని వ్యాపారదృష్టితో అమ్మకొనుటకు ప్రతివాని కిని స్వాతంత్ర్యముగలదు. కాని ప్రమాణిత ఖాది ఉద్య మముయొక్క మూలఉద్దేశ ఆశయములను తెలిసికొనుటయు, ఖాది ఉద్యమముపట్ల ప్రజలకుగల సదుద్దేశముతో వ్యాపార అభివృద్ధి కొరకుగాని, స్వార్థము కొరకుగాని అక్రమ లాభము నందకుండుటయు నైతిక ధర్మమైయున్నది. లేదా ఉభయుల వ్యవహారపు టంకెలను ప్రజల యెదుటనుంచుట మా విధియైయుండును. సరియైన నిర్ణయమునకు తెచ్చి, చరఖా సంఘమువారి శుద్ధఖాదీపట్ల సుముఖులుగాచేసి అనుమాన రాహిత్యము జేయుటకుగాను చరఖాసంఘ పక్షమున నిజాం రాష్ట్రమునందు ఏండ్లతరబడి జరుగుచున్న ప్రమాణిత ఖాది

కార్యక్రమమును, దానికి కలిగిన విజయమును జనసామాన్యమున కెరుకపరచుట మా కర్తవ్యమైయున్నది.

అఖిలభారత చరఖాసంఘపు మహారాష్ట్ర శాఖ ౧౯౨౫ లో హైదరాబాదు రాష్ట్రమునందు వ్యవహారమును ప్రారంభించెను. హిందూ దేశములోని ఇతర ప్రాంతముల వలె ఇచటను ఖాది పరిశ్రమ క్షీణించుచుండెను. వడుకు వారు, నేయువారు హీనదశ పాలగుచుండిరి. వారి దైహిక మరియు నైతికశక్తి నానాటికి తగ్గుచుండెను. బుద్ధికుశలత అడుగంటుచుండెను. ఇట్లు ఖాదిఉద్యమము ప్రారంభమైనందున వారికి జీవనోపాధి కలుగుటయేగాక వేలకొలది వ్యక్తుల బుద్ధికుశలత నైపుణ్యము పెంపొందుటకు వీలుకలిగినది.

వారిలో ఆత్మగౌరవ భావోదయము కలిగినది. మొట్టమొదట మహారాష్ట్ర చరఖా సంఘమునకు రాజకీయ మరియు సాంఘిక ఇబ్బందుల నెదుర్కొనవలసివచ్చెను. గ్రామవాసులు సైతము సంఘ సందేశమును నమ్మలేదు. ఇంతేల గ్రామములకు వెళ్లు కార్యకర్తలకు ఆశ్రయమిచ్చుటకు వెనకంజ వేయుచుండిరి. అయినను పైసంఘ కార్యదర్శులగు శ్రీకృష్ణదాసుజాజు మరియు అన్నాసాహెబు సహస్రబుద్ధిగారల మార్గదర్శకత్వమున కార్యకర్తలు తమ కార్యక్రమము సాగించుచునేయుండిరి. రానురాను గ్రామవాసులు వీరిని సమీపించిరి. పని నడువసాగెను. కార్య

కర్తలు సిద్ధము చేయబడిరి. అవసర వస్తుసామగ్రి సమకూర్చ బడెను అందుకు ఫలితముగా నేడు, మహారాష్ట్ర ప్రాంతము లోని మొత్తము ఖాది ఉత్పత్తిలో సగము మన రాష్ట్ర ములో జరుగుచున్నది. అనగా మొత్తము మహారాష్ట్ర ప్రాంత ములో (౪౪౨౨౪౨) రూపాయిల ఖాది ఉత్పత్తియైన మన రాష్ట్రమునందలి (౫) కేంద్రములలో (౨౨౯౦౦౦) రూపాయిల ఖాది ఉత్పత్తి యగుచున్నది. ఇందువలన వేలకొలది ప్రజలకు పని దొరుకుచుండుట స్పష్టము. ఈక్రింద ఉదహరింపబడిన పట్టికలను గమనించినచో — ఖాది ఉత్పత్తి, విక్రయము, నేయువారి, వడకువారిసంఖ్య, ప్రమాణిత మరియు అప్రమాణిత ఖాదిల కూళ్లలోనుండు భేదము మరియు కార్యకర్తల వేతనములు, తెలియగలవు.

---

# జిల్లాసభలు

శ్రీ వెల్దుర్తి మాణిక్యరావుగారి అనువాదము.

నేటి అత్యవసరమైన ముఖ్యాతి ముఖ్యమైన సమస్య— ఈజిల్లా సభలే.

ప్రతిఘటించుటకును సమర్థించుటకును విషయము తెలిసియుండవలెను.

కనుక వెంటనే పుస్తకము కొనుడు.

౪ అణాల టపాటికెట్లు పంపినచో పుస్తకము పంపబడును.

ఆంధ్ర పబ్లిషింగ్ కంపెని

సుల్తాన్‌బజారు ... హైదరబాదు.

అనుబంధము (౧) నిజాంరాష్ట్రమునందు అ. చ. సంఘ మహారాష్ట్రశాఖ యాజమాన్యమున జరిగినఖాది ఉత్పత్తి

| సంఖ్య | స్థలము | ౧౯౩౭ | ౧౯౩౮ | ౧౯౩౯ | ౧౯౪౦ |
|---|---|---|---|---|---|
| ౧ | నాందేడు | ౧౮౯-౧౫-౬ | ౭౬౪-౩-౭ | — | — |
| ౨ | మెట్టుపల్లి | ౧౩౯౦౧౨-౫-౬ | ౧౭౯౬౬౭-౭-౯ | ౧౧౭౮౮౯-౨-౦ | ౧౩౬౨౧౧-౨-౨ |
| ౩ | వాయిలాలు | ౫౪౪౬౩-౫-౬ | ౯౫౭౧౭-౧౨-౬ | ౫౫౭౦౩-౬-౦ | ౪౭౯౮౯-౧౦-౧ |
| ౪ | రెబ్బనా | ౩౯౭౫౦-౬-౦ | ౬౬౭౯౪-౫-౬ | ౫౯౨౫౬-౦-౦ | ౬౮౦౫-౧౪-౧౧ |
| ౫ | దహాగాం | — | — | — | ౧౮౨౪౦-౧౪-౪ |
| | మొత్తము= | ౨౩౩౪౧౫-౧౩-౬ | ౩౪౨౯౪౩-౧౩-౪ | ౨౩౨౮౪౮-౮-౦ | ౪౨౯౨౪౭-౯-౬ |

అనుబంధము (౨)=అ. భా. చరఖాసంఘపక్షమున నిజాంరాష్ట్రమునందు ఖాది విక్రయమును తెలుపుపట్టిక

| సంఖ్య | స్థలము | ౧౯౩౭ | ౧౯౩౮ | ౧౯౩౯ | ౧౯౪౦ |
|---|---|---|---|---|---|
| ౧ | హైదరాబాదు | ... | ౧౫౯౬౮-౭-౧౦ | ౩౨౪౩౧-౪-౨ | ౩౨౪౧౭-౩-౨ |
| ౨ | సికిందరాబాదు | . | ౯౩౪౨-౧౫-౩ | ౯౯౮౪-౧౧-౧ | ౧౨౫౨-౭-౯ |
| ౩ | నిజామాబాదు | ... | ౨౩౦౫-౨-౧౧ | దుకాణం మూయబడినది | |
| ౪ | నాందేడు | ... | ౪౬౧౧-౬-౪ | ౭౪౩౧-౫-౭ | ౭౭౭౪-౬-౦ |
| ౫ | అవురంగాబాదు | ... | ... | ౨౧౩౬-౧-౫ | ౭౭౭౫-౫-౯ |
| ౬ | పర్భని | ... | | ... | ౧౧౬౨-౩ ౧ |
| | మొత్తము— | ... | ౩౨౨౨౮-౦-౪ | ౫౧౯౮౩-౪-౧౧ | ౬౧౬౮౧-౯-౯ |

అనుబంధము (౩) అఖిలభారత చరఖాసంఘపు మహారాష్ట్రశాఖకు చెందిన కేంద్రములందలి వడుకువారియొక్కయు, నేతగాండ్రయొక్కయు సంఖ్యను తెలుపు పట్టిక

| పేరు | ౧౯౩౨ | ౧౯౩౭ | ౧౯౩౯ | ౧౯౪౦ |
| --- | --- | --- | --- | --- |
| దూదేకువారు | — | ౪౬౦ | ౯౧౦ | ౩౬౨ |
| వడుకునట్టి దూదేకువారు | — | ౧౫౮౭౩ | ౩౯౭౯ | ౨౩౪౦ |
| వడుకువారు | — | ౬౨౫౮ | ౬౧౫౯ | ౨౪౭౨ |
| నేతగాండ్రు | — | ౧౮౯౬ | ౧౪౬౮ | ౧౪౩౫ |
| మొత్తము | — | ౧౦౦౯౧ | ౧౮౫౮౦ | ౧౬౬౮౯ |

అనుబంధము (౪) కులములను తెలుపు పట్టిక

| కులము | ౧౯౩౭ | ౧౯౩౯ | ౧౯౪౦ |
| --- | --- | --- | --- |
| హిందువులు | ౬౦౧౫ | ౬౬౪౦ | ౭౦౦౩ |
| మహమ్మదీయులు | ౨౯౬ | ౯౦౧ | ౧౨౮౦ |
| హరిజనులు | ౩౮౭౮ | ౪౯౨౯ | ౬౭౭౫ |
| ఇతరులు | ... | | ౮౦ |
| మొత్తము | ౧౦౦౯౩ | ౧౩౫౮౦౦ | ౧౬౬౮౯ |

అనుబంధము (౫)

ప్రమాణిత మరియు అప్రమాణిత ఖాదీల ఉత్పత్తిలోను విక్రయములోను గలభేదమును తెలుపుపట్టిక

| నెరుపు, పూర | అప్రమాణిత ఖాది గజము ౧కి | | | [illegible] | ప్రమాణిత ఖాది గజము ౧కి | | | |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |
| | పడతలు | అమ్మకము | లాభము | | పడతలు | అమ్మకము | లాభము | ప్ర॥ లాభం |
| ౩౮×౧౮×౧౦ | ౦-౩-౬ | ౦-౫-౬ | ౦-౮-౦ | ౫౬ | ౦-౬-౦ | ౦-౨-౦ | ౦-౧-౦ | ౧౬ |
| ౩౬×౧౮×౧౩ | ౦-౪౦ | ౦-౬-౦ | ౦-౮-౦ | ౫౦ | ౦-౨-౦ | ౦-౭-౦ | ౦-౧-౦ | ౧౪ |
| ౪౫×౧౮×౧౬ | ౦-౫-౬ | ౦-౭-౦ | ౦-౮-౬ | ౪౫ | ౦-౯-౦ | ౦-౯-౦ | . | . |
| ౫౦×౧౮×౧౭ | ౦-౫-౯ | ౦-౯-౦ | ౦-౩-౩ | ౪౭ | ౦-౯-౯ | ౦-౧౧-౦ | ౦-౧-౩ | ౧౩ |
| కోటుబట్ట | | | | | | | | |
| ౮౨×౧౪×౨॥ | ౦-౨-౦ | ౦-౧౦-౦ | ౦-౩-౦ | ౪౮ | ౦-౯-౦ | ౦-౧౦-౦ | ౦-౧-౦ | ౧౧ |

## అనుబంధము (౬)

మూలలోనున్న, కేంద్ర కార్యాలయము, ఖాది దుకాణములు మరియు ఉత్పత్తి కేంద్రములందు

పనిచేయువారి వేతనములను తెలుపు పట్టిక

| వేతనము | ౧౯౩౯ లో సంఖ్య | ౧౯౪౦ లో సంఖ్య |
|---|---|---|
| ౨ నుండి ౧౦ రూ. వరకు | ౭౨ | ౯౨ |
| ౧౧ నుండి ౧౫ ,, | ౬౯ | ౫౯ |
| ౧౬ నుండి ౨౦ ,, | ౨౩ | ౨౯ |
| ౨౦ నుండి ౨౫ ,, | ౨౩ | ౨౦ |
| ౨౧ ,, ౩౦ ,, | ౧౬ | ౨౭ |
| ౩౦ ,, ౩౫ ,, | ౧౩ | ౧౦ |
| ౩౬ ,, ౪౦ ,, | ౧౦ | ౧౨ |
| ౪౦ ,, ౪౫ ,, | ౬ | ౬ |
| ౪౫ ,, ౫౦ ,, | ౭ | ౯ |
| ౫౦ ,, ౬౦ ,, | ౨ | ౧ |

## అనుబంధము (౭)

వడుకు వారికిని, నేయు వారికిని; చరఖా సంఘమువారు మరియు అప్రమాణిత ఖాది వర్తకులు ఇచ్చునట్టి కూళ్లలోగల భేదము ఈ క్రింది పట్టికలో చూడనగును

| వివరములు — | చరఖా సంఘమువా రిచ్చునట్టి కూలి. | అప్రమాణిత ఖాది వర్తకు లిచ్చునట్టి కూలి. |
|---|---|---|
| ౧ నేరుదూది ఏకినందుకు కూలి— | ౦-౪-౦ | ౦-౨-౦ |
| ౧ నేరు దారము (౧౦ నంబరు) వడుకుటకు | ౦-౧౫-౦ | ౦-౫-౦ |
| ,, ౧౧ ,, | ౧-౦-౦ | ౦-౫-౦ |
| ,, ౧౨ ,, | ౧-౨-౦ | ౦-౬-౦ |
| ,, ౧౪ ,, | ౧-౫-౦ | ౦-౮-౦ |
| ,, ౧౬ ,, | ౧-౧౦-౦ | ౦-౮-౦ |
| ,, ౨౦ ,, | ౨-౦-౦ | (౨౦) నంబరు దారము వీధము గాదు |
| ౩౨ అంగుళముల కమీజాబట్ట నేయుటకు | ౧-౦-౦ | ౦-౧౪-౦ |
| ౩౬ ,, ,, ,, ,, | ౧-౨-౦ | ౦-౧౫-౦ |
| ౩౬ ,, దొడ్డుబట్ట ,, | ౨-౪-౦ | ౧-౦-౨-౦ |
| ౨౬ ,, ఉత్తమ తరగతికి చెందిన బట్ట నేయుటకు కూలి | ౩-౨-౦ | — |

వ్యవస్థ మరియు బాడుగ ఖర్చులలోను వడకలు మరియు అమ్మకములలో నూటికి (౨౦) వంతున భేదముండును. నూటికి ౪౦ నుండి ౫౦ వంతున లాభముండును.

| ౮ గంటలు నూలువడుకువారికి ఇచ్చుకూలి | ప్రమాణిత | అప్రమాణిత |
|---|---|---|
| ౧౦ నంబరు దారము ,, ,, | ౦-౩-౦ | ౦-౧-౦ |
| ౧౧ ,, ,, ,, ,, | ౦-౩-౦ | ౦-౧-౦ |
| ౧౨ ,, ,, ,, ,, | ౦-౩-౦ | ౦-౧-౨ |
| ౧౬ ,, ,, ,, ,, | ౦-౩-౨ | ౦-౧-౨ |
| ౨౦ ,, ,, ,, ,, | ౦-౩-౪ | — |

పై అంకెలను గమనించినచో చరఖా సంఘమువారి కార్యాచరణ పద్ధతి స్పష్టపడగలదు. ఇట్టి అంకెలు అప్పటి కప్పుడు నివేదికల రూపమున ప్రకటింపబడుచుండును. ఇక అప్రమాణితఖాది వర్తకులకు ధైర్యమున్నచో వారును నిజమైన సంగతులను అంకెలను ప్రకటించుచు, ఎంతవరకు బీదలకు ఉద్యోగము నియ్యకలిగిరో తెలియజేయవలెను.

ఈ వ్యాసమును ప్రకటించుటలోగల ఉద్దేశము, చరఖా సంఘమువారి ప్రయత్న ఫలితముగా కలిగిన అనుకూల వాతావరణమునుండి స్వార్థపరులు కొందరు లాభము పొందుచు మీాదు మిక్కిలి తమదే "శేలు"యని చేయు పెడవాదమును ఖండించుటయే గాని అప్రమాణిత ఖాది వర్తకుల యెడ దురభిప్రాయమును కలుగజేయుటగాదు.

దినమునకు (౮) గంటలు పనిచేయువారికి కనీసము జీవితావసరములను పూర్తి చేసికొనుటకై ౦-౩-౦ కూలి యొసగునట్లు చేయుటయే చరఖా సంఘముయొక్క ఉద్దేశమై యున్నది. ఇందుకు విరుద్ధముగా అప్రమాణిత ఖాది వర్తకులు పాపము కూలీలతో ఎక్కువ కెక్కువపని తీసికొని తక్కువకు తక్కువ కూలి నిచ్చెదరు.

చరఖా సంఘమువారు వ్యవస్థ మరియు బాడుగ మొదలగు ఖర్చులుపోను మిగిలిన ధనముతో కూలీల కొరకు వైద్యశాలలు, పాఠశాలలు, మరియు చౌక ధాన్యపు దుకాణములు స్థాపించెదరు. ఇందుకు విరుద్ధముగా అప్రమాణిత ఖాది వర్తకులదృష్టి స్వంత లాభముపైననే యుండును.

ఇట్లు
రామకృష్ణ ధూత్
హైదరాబాదు ఖాది ప్రచారసంఘ కార్యదర్శి

---

# అఖిల భారత చరఖా సంఘము

## ప్రమాణిత పత్రములనుగూర్చిన నియమములు

౧. ఖాదీ ఉత్పత్తి మరియు విక్రయముకొరకును, లేక ఒక్క విక్రయముకొరకును ప్రమాణిత పత్రము లొసగబడును. ఇట్టి ప్రమాణిత పత్రములు ఖాదీ వ్యవహారము సల్పునట్టి వ్యక్తులకును సంస్థలకును ఇయ్యబడునే గాని వస్తువులకు (అనగా ఖాదీ లేక ఖాదితో చేయబడు వస్తువులకు) గాదు.

౨. చరఖాసంఘ శాఖయొక్క ఏజంటుకును, ఏజంటు లేనిచోట కార్యదర్శికిని ప్రమాణిత పత్రము నిచ్చు అధికారముగలదు. ఏ ప్రాంతమునందు వ్యవహారము జరుపదలచిన ఆ ప్రాంతపు శాఖాధికారినుండి ప్రమాణిత పత్రమును పొందవలెను,

౩. తమతమ ప్రత్యేక పరిస్థితుల ననుసరించి శాఖలన్నింటికిని ఉపనియమములను చేసికొను అధికారముగలదు. కాని అవి పైసంఘ నియమములకు వ్యతిరేకముగా నుండగూడదు. అప్రమాణితఖాదీ వర్తకులు, అ. భా. చరఖా సంఘము, దాని శాఖలయొక్క ప్రస్తుత, మరియు అప్పుడప్పుడు చేయబడు నియమములకును ఉపనియమములకును బద్ధులై యుండవలెను.

౪. ప్రమాణిత ఖాదీవర్తకులు తమ ఖాదీ వ్యాపార

ము నంతయు చరఖాసంఘ నియమముల ననుసరించిగాని, దాని ద్వారా కాని లేక వ్యవహారము జరుగు ప్రాంతీయ శాఖద్వారాగాని అప్పుడప్పుడు నడగబడు హెచ్చరికల ననుస రించి జరుపుచుండవలెను.

౫. ప్రమాణపత్రము ఒక సంవత్సరముకన్న ఎక్కువ కాలము కొరకు ఇయ్యబడదు. ప్రమాణపత్రి సంవత్సరము ౧ జులైనుండి మొదలై 30 జూనువరకు అంతమగును. మధ్య కాలమున తీసికొన్న ప్రమాణపత్రిముయొక్క గడువు సం వత్సరాంతమున పూర్తియగును. ఈ సంవత్సరము అంత మగుటకు ఒక నేల పూర్వమే వినతిపత్రము బంపుకొని పత్రి మును కొత్తపరచుకొనవలెను. పత్రముయొక్క గడువు పూర్తి యైనతర్వాత, తిరిగి పత్రిమును పొందనిది ఖాది ఉత్పత్తిగాని విక్రియముగాని చేయకూడదు.

౬. ప్రమాణపత్రమును గోరు వ్యక్తి మరియు అతనితో బాటు ఖాది పనిచేయువారును అలవాటుగా ఖాది తొడుగు వారై యుండవలెను; నియమానుసారము ప్రతి నెల కనీసము (౭౫) గుండీల నూలు (౧౪౦ గజములకు ఒక్కగుండి) వడుకవలెను. మరియు చరఖాసంఘ సభ్యులుగా (నూలు వడుకువారుగా) నుండవలెను. అప్పుడే వారికి ప్రమాణపత్రము నొసగబడును. వ్యక్తిగాక, ఏదేని సంఘములేక సంస్థ ప్రమాణపత్రిమును పొందగోరుచో ఆ సంఘము లేక సంస్థ యొక్క సభ్యులు, ఉపాధ్యాయులు, విద్యార్థులు మరియు

కార్యకర్తలు మొదలగువారందరు అలవాటుగా ఖాది తొడుగువారై యుండవలెను. ఇక, నూలు వడుకునట్టి మరియు చరఖాసంఘముయొక్క నూలు వడుకు సభ్యులుగా నుండు నట్టి నిబంధన 'ఆ సంఘముయొక్క ప్రత్యేక అధికారికి మాత్రమే యుండును. అదియునుగాక సంఘముయొక్క ఉద్దేశము ఆశయములందు ఖాదికి ప్రత్యేకస్థానముండవలెను. ప్రత్యక్షముగనైనను, పరోక్షముగనైనను గిర్ని నూలు, లేక గిర్ని నూలుతో చేయబడిన బట్టల వ్యాపారము వ్యక్తిగాని, సంఘముగాని చేయరాదు.

ఉత్పత్తి ప్రమాణముల పత్రముల నిచ్చునప్పుడు శాఖ యొక్క దృష్టిలో వ్యక్తులకన్న ఎక్కువ ప్రజాహిత సంస్థ, ట్రస్టులేక రిజిష్టరు చేయబడిన సంఘము లుండగలవు.

౭. ప్రమాణపత్రమును పొందిన వర్తకుడు నియమము లను, ఉపనియమములను సరిగా పాలించనిచో గడువు లోప లనే ప్రమాణపత్రము రద్దుపరుపబడగలదు. వర్తకుడు నియమ విరుద్ధముగనడచినది లేనిది నిర్ణయించు అధికారము శాఖకు జెందియుండును. శాఖయొక్క న్యాయమును వర్తకుడు ఒప్పు కొనవలసియుండును.

౮. ప్రమాణిత ఖాది ఉత్పత్తి చేయువారు, చేతితో వడికిన నూలును, మగ్గముపై చేతితో నేయించవలెను. అందు గిర్ని నూలు ఏమాత్రమును కలువకుండునట్లు గట్టి వ్యవస్థచేయవలెను.

శాఖ తెలిపినవిధమున పనివారి ఖాతానుంచవలెను. అట్లు ఖాతాలో పేరెక్కించిన వారినుండియే నూలు తీసి కొనవలెనేగాని నేసిన బట్టను కొనగూడదు. కొన్న నూలుతో బట్ట నేయించవలెను. పనివారికి శాఖవారు ఏర్పాటుచేసిన దానికన్న తక్కువ కూలి నియ్యకూడదు. వారికి శిక్షణనిచ్చి (పని నేర్పి) ఆమాత్రము కూలి పొందుట కర్హులుగా జేయ వలెను. మరియు వారికి మంచి పనిముట్లు, వ్యవస్థచేయవలెను.

ప్రమాణితఖాది వర్తకుడు వస్తువులను ఇతర ప్రాంతము లందు విక్రయించజాలడు. తన ప్రాంతములోనే అదియును శాఖవారు నిర్ణయించిన హద్దులలోనే సామగ్రి దొరకునట్లు విక్రయించవలెను.

ఖాది విక్రయ ప్రమాణ పత్రములు సాధారణముగా ఖాదిపట్ల ప్రేమ గలగియున్నట్టి మరియు ఖాది వ్యాపకము ద్వారా దేశసేవ చేయదలచినట్టి వ్యక్తులకును, సంఘముల కును ఇయ్యబడును. ప్రమాణ పత్రమును పొందినవారు కోరుచోట ఖాది విక్రయము అవసరమా కాదా యను విష యము బాగుగా ఆలోచించబడును. అంతకుపూర్వమే శాఖ వైపునుండి గాని, ప్రమాణపత్రము నొందిన వర్తకుని వైపు నుండిగాని ఖాది దుకాణమున్నచోట కొత్తగా దుకాణము పెట్టుటకు ఆజ్ఞయొసగబడదు.

సాధ్యమైనంతవరకు తమ ప్రాంతపు వస్తువులనే విక్రయించవలసియుండును.

౧౦. ప్రమాణితఖాది వర్తకుడు, తనకొరకు నిర్ణయింప

బడిన హద్దులలోనే వ్యాపారము సాగించవలెను. శాఖ లేక తదితర ప్రమాణితఖాది వర్తకుల వ్యాపారమునందు ఆటంకము కలిగించగూడదు

౧౧. ప్రమాణితఖాది వర్తకులు శాఖయొక్క నిర్ణయానుసారము లెక్కపత్రము లుంచవలెను. అట్టి లెక్కపత్రములను పరిష్కర్తలకు చూపించవలసియుండును. లెక్కల పరిష్కారము చేయుటలో వారికి సహాయపడవలసి యుండును. అంతేగాక అప్పుడప్పుడు కోరబడు నివేదికలను, అంకెలను అందజేయవలసి యుండును. వార్షిక లెక్కలను పరిష్కరింపజేసి శాఖకు పంపించవలెను.

౧౨. ప్రమాణపత్రము పొందిన ఖాదివర్తకుడు, శాఖచే అప్పుడప్పుడు నిర్ణయింపబడు ధరలకే అమ్మవలెను. ఇతర ప్రాంతములనుండి ఖాదిక్రయ విక్రయము శాఖ ద్వారా చేయ కలుగును. అప్రమాణిత ఖాదివర్తకులకు తనసరుకును అమ్మజాలడు

౧౩. శాఖవారు నిర్ణయించినఖర్చులు పోను మిగిలిన రకమును ప్రమాణపత్రమును పొందిన ఖాదివర్తకులు శాఖకు ఇయ్యవలెన. అట్టిరకము "సేవాకోశము"లో చేర్చబడి పనివారల మరియు గ్రామకుల హితముకొరకు వ్యయపరచబడును.

౧౪. ప్రమాణపత్రము మరియు పరిష్కారముకొరకు నిర్ణయింపబడిన రుసుము, వినతిపత్రము (దరఖాస్తు) అంగీక

రింపబడిన తర్వాత, చెల్లించి, ప్రమాణపత్రమును పొందవలెను.

## ఉత్పత్తి

మొదటి (౫౦,౦౦౦) రూపాయిల వెలగల ఉత్పత్తి పై ౧౦౦కి ౦-౪-౦ చొప్పునను, ఉత్పత్తి అంతకుమించినచో ౧౦౦కి ౦-౨-౦ చొప్పునను రుసుము ఇయ్యబడును. రుసుము కనీసము ౧౦-౦-౦ ఇయ్యబడును.

## విక్రయము

ఉత్పత్తి కేంద్రమునందు, ఉత్పత్తి చేయువారిచే పెట్టబడు ఖాది దుకాణమునుండి ఏమియు తీసికొనబడదు. మిగత దుకాణములన్నింటినుండి ఈక్రిందివిధముగా రుసుము తీసికొనబడును.

| | |
|---|---|
| ౫౦౦౦ రూపాయిలకు తక్కువ విక్రయించు దుకాణములనుండి | ౫ |
| ౫౦౦౦ రూపాయిలకు మించికాని ౧౦,౦౦౦ | ౧౦ |
| ౧౦,౦౦౦ రూపాయిలు లేక అంతకుమించి | ౧౫ |

ప్రమాణపత్రముయొక్క గడువు ముగిసిన వెంటనే, లేక అది రద్దుపరుపబడినట్లు వార్త తెలిసిన వెంటనే ప్రమాణపత్రముల నిచ్చునట్టి చరఖాసంఘశాఖకు తిరిగిపంపవలెను.

# ప్రమాణితఖాది ఏజంట్లకు సూచనలు

ఖాదియొక్క అవసరము మరియు ప్రాముఖ్యత దిన దినము పెరుగుచున్నది. కనుక ఖాదిప్రచారము విరివిగాచేయు నుద్దేశముతో రాష్ట్రమంతటను పర్యటనగావించి ప్రమాణితఖాదిని విక్రయించుటకై అచ్చటచ్చట ఏజంట్లను నియమించుటకు మేము అభిప్రాయ పడుచున్నాము. ఇట్లు నియమింపబడుఏజంట్లకు ఈక్రింది విషయములను తెలియబరచుట మా విధియని తలంచెదము:—

౧. అలవాటుగా ప్రమాణితఖాదిని ఉపయోగించువారే చరఖాసంఘపు ప్రమాణితఖాది విక్రయమునకై ఏజంటుగా నియమింపబడగలరు.

౨. నగదు రూపయిలిచ్చి ఖాది కొనవలెను.

౩. ఏజంట్లద్వారా అమ్మబడు ఖాదిపై నూటికి ౯-౬-౦ చొప్పున కమీషను ఇయ్యబడును.

౪. ఏజంట్లు ఒక్కసారికొన్న ఖాదిని, తిరిగిఇచ్చి అందుకుబదులు అంతటి వెలగల ఖాదిని తీసికొనవచ్చును. కాని తిరిగి ఇయ్యబడుఖాది చెడిపోకుండనుండవలెను.

౫. హైదరాబాదు, సికిందరాబాదు, ఔరంగాబాదు, నాందేడు, లాతూరు, రాయచూరు, మరియు వరంగలు లోని ప్రమాణితఖాది దుకాణములనుండి ఖాది తీసికొనవచ్చును.

౬. ఖాదిదుకాణమునుండి ఏజంటువరకు తగులు రైల్వే

ఖర్చులు ఏజంటు భరించుకొనవలసియుండును. కాని ఖాది దుకాణము (భండారు)నందు ఏధరకుకొనెనో ఆధరకే అమ్మవలసియుండును.

౭. గాంధిజయంతి, జాతీయవారము మొదలగు సమయములందు స్థానిక కార్యకర్తల సహాకారముతో ఏజంటు ఇల్లిల్లుతిరిగి ఖాది అమ్మకము చేయదలచినచో వారికై ప్రత్యేకముగా ఒకవ్యక్తి వెంట ఖాది పంపబడును. అమ్మకము ముగిసినవెంటనే రకము వసూలుచేసికొని ఆవ్యక్తి రాగలడు. ఇట్టి అమ్మకముపైనను ఏజంటుకు కమీషను ఇయ్యబడును కాని ఆవ్యక్తిపై యగుఖర్చు, మరియు ఖాదియొక్క రైల్వేఖర్చు తీసికొనబడును.

౮. ఏదేని పలుకుబడిగల కార్యకర్త పెట్టుబడిలేని కారణమున ఏజన్సి తీసికొజాలని స్థితియందున్నచో, మేము వారున్నచోటికి వెళ్లియో, ఉత్తరప్రత్యుత్తరములవల్లనో స్థానిక వ్యాపారస్థులనుండిగాని ధనికులనుండిగాని పెట్టుబడినిప్పించుటకు ప్రయత్నించగలము.

ఈవిషయమున వివరములు తెలియగోరువారు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

కార్యదర్శి

హైదరాబాదు ఖాది ప్రచారసంఘము.

టప్పా, హైదరాబాదు

# ఖా ది ని ధి

౧౯౪౭ (౧౩౫౧)సంవత్సరమున జరుపబడు జాతీయ వారసందర్భము హైదరాబాదు ఖాదిప్రచారసంఘాధ్యక్షు లైనా శ్రీ రాంచంద్రరావుఅంతు హైకోర్టు వకీలుగారు ఖాది నిధి (ఫండు)నిగూర్చి ఈక్రింది ప్రకటన గావించుచున్నారు.

గతసంవత్సరములవలె ఈసారి జాతీయవారసందర్భమున ఇంటింటికితిరిగి ఖాది, మరియు హుండీలను అమ్మట ఈ సంవత్సరము సాధ్యముకాదు. ఉత్పత్తిక్రిమించిన గిరాకిదొరుకుటయే అందుకు కారణము. కనుకఇప్పుడు కావలసినదిఖాది ఉత్పత్తిని ఎక్కువజేయుటయే. ఇందుకు పెట్టుబడిఅవసరమగును ఇట్లు ఈసంవత్సరపు జాతీయవారసందర్భమున బట్టను, హుండీలను అమ్మటకుబదులు మా కార్యకర్తలు "ఖాదినిధి" కొరకు చందాలు వసూలుచేయవచ్చెదరు.

గత (౧౫) సంవత్సరములనుండి నిజాంరాష్ట్రమునందు మహారాష్ట్ర చరఖాసంఘము ఖాదివిషయమున చేయుచున్న సేవ వర్ణనాతీతము. కానిప్రస్తుతము హైదరాబాదులో ఖాది గిరాకి చాలచాల పెరిగినది కనుక ఖాదిఉత్పత్తి భారమును వహించుటకు ఇది స్వర్ణావకాశము.

ఒకలక్ష రూపాయిల పెట్టుబడి మరియు తగుసంఖ్యలో కార్యకర్తలు యున్నప్పుడే మనమీభారమును వహించకలుగుదుము. తగుసంఖ్యలో కార్యకర్తలుమాతో సహకారముచేయుచున్నారని తెలుపుటకు మేముసంతసించుచున్నాము.

ములు, మెట్టుపల్లి మరియు వర్ధాకు శిక్షణార్థము పంప బడువారిసంఖ్య దినదినము పెరుగుచున్నది. పెట్టుబడి సమ కూర్చుటయే ముఖ్యసమస్యయై యున్నది కనుక దేశభక్తిగల వారిలోని, ఖాదియెడ ప్రేమగలవారిని, ఈనిధికి హృదయ మువిప్పి చందాలొసంగగలరని సవినయముగా ప్రార్థించుచు న్నాము.

ఈనిధిలో సమకూరిన ధనము, అఖిలభారత చరఖా సంఘముయొక్క స్వతంత్రశాఖను హైదరాబాదులో స్థాపిం చుటకు వ్యయపరుపబడును. ఇంత పెద్దమొత్తము సమకూరు టలో కొంతకాలము పట్టవచ్చును. కనుక అంతవరకు ఎట్లెట్లు ధనము సమకూరునో అట్టట్లు "అఖిలభారత చరఖాసంఘము" వారి పర్యవేక్షణలో హైదరాబాదు రాష్ట్రమునందు అచట చట ఉత్పత్తి కేంద్రములను స్థాపించుటలో వ్యవపరుపబడును.

ఈనిధిలో డబ్బుప్రోగుచేయుటకు ఎక్కువ కెక్కువ స హాయము చేయగలరని మేము జనసామాన్యముతో విన్నవిం చుకొనుచున్నాము.

ఇట్లు

రాంచంద్రరావు అంతు (అధ్యక్షుడు)

రామకృష్ణధూత్ (కార్యదర్శి)

# ఖాదినిధి (ఫండు) ఎందుకవసరము?

గత ౧౩-౧౪ సంవత్సరములలో చరఖాసంఘమువారు బయటిడబ్బు, బయటి కార్యకర్తల సహాయమున నిజాం రాష్ట్రములో ౧౪ లక్షలఖాదిని సిద్ధపరచిరి. ఇందు (౪,౭౫౦౦౦) రూపాయిల ఖాదిమాత్రమే హైదరాబాదులో అమ్ముడుపోయినది. మిగత ఖాదియంతయు బయటనే విక్రయింపబడినది.

కాని ఈరాష్ట్రపు వ్యవసాయదారులకు పత్తిబాబతు ౫ లక్షల రూపాయిలు దొరికినవి. ప్రతిశతి (౧౫) నుండి (౨౦)వరకు వ్యవస్థకు సంబంధించిన ఖర్చులుపోను ౧౨ లక్షలకు తక్కువకాని మొత్తము ఈ రాష్ట్రములోని కూలీలకు, ఏకుట, వడుకుట, నేయుట, అద్దుట, ఉతుకుటకొరకు చెందినవి.

౧౯౪౧లో ౪-౫ లక్షలఖాది సిద్ధమైనది. అందు (౧,౨౫,౦౦౦) రూపాయిల ఖాదిమాత్రమే ఇచట అమ్ముడుపోయినది. ఇక ౧౯౪౨లో మెట్టుపల్లి, వాయిలాలు రెబ్బనా, దమాగాంపు, గద్వాల, గోపాలపేట, రాజోలి, మొదలగు చరఖాసంఘమువారి కేంద్రములందు (౭) లక్షల ఖాది సిద్ధమగునని ఆశింపబడుచున్నది. కాని ఇచట ౨-౨¼ లక్షల ఖాదిమాత్రమే అమ్ముడుబోవు సూచనలున్నవి.

గత ౨-౩ సంవత్సరములనుండి ఖాది ప్రచారసంఘమువారి నిరంతరకృషి జరుగుచున్నను ఉత్పత్తినిబట్టి విక్రయము చాలతక్కువ పెరిగినది. ఖాదిఉత్పత్తి పెంచవలెనని

రాష్ట్రములోని నలువైపులనుండి ఒత్తిడి వేయబడుచున్నది. ప్రస్తుతము గావింపబడు ఉత్పత్తిలోని అత్యధిక భాగము బయటికిపోవుచున్నది. ఒకవైపు విక్రయము పెంచుట అవసరమై యుండిన, మరియొకవైపు క్రొత్త క్రొత్త ఉత్పత్తి కేంద్రములను స్థాపించవలసియున్నది. ఖాది విక్రయమును పెంచుటకై ప్రతి జిల్లాలో కనీసమొక ఖాదిదుకాణము, అనేక ప్రతినిధులు ఉండవలెను. చరఖాసంఘమువారు వినియోగించిన పెట్టుబడి సరిపోదు. పెట్టుబడిని పెంచుటకై రాష్ట్రమునందు "ఖాదినిధి" సమకూరవలెను. ఉత్పత్తి మరియు విక్రయ కేంద్రముల నెక్కువచేయుటకొరకు తగుసంఖ్యలో కార్యకర్తలుగూడా అవసరమైయున్నారు. చరఖాసంఘము బయటిపెట్టుబడి, బయటి కార్యకర్తలతో నిజాం రాష్ట్రమునందెంతవరకు పనిచేయుచుండగలదు. నిజాం రాష్ట్రవాసులు తమ కర్తవ్యమును గుర్తించరా? ఖాదివంటి పవిత్రమైన, పరోపకారికమైనట్టి, కార్యమునకై నిజాం రాష్ట్రమునందు కనీసమొక లక్షరూపాయిలు సమకూర్చుట ఒక పెద్దవిషయము గాదు. కావలసినది ఖాదియెడ ప్రేమగలవారి సహాయ సహకారములు మాత్రమే!

ఇట్లు
హైదరాబాదు ఖాది ప్రచారసంఘ
కార్యదర్శి

సంపూర్ణము.

# విషయ సూచిక.